

శ్రీ వరాహ మిహిరాచార్య విరచిత

# బృహజ్జాతకము

తెలుగులో మొట్టమొదటసారిగా

(దశాధ్యాయీ వ్యాఖ్యానుసారముగా)

ఆంధ్రానువాదము
బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్
M.A. సంస్కృతం

ప్రచురణ కర్తలు ✆ 2465253
**గొల్లపూడి వీరాస్వామి సన్**
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్
కోటగుమ్మం - రాజమండ్రి - 1
 2006 వెల : 90–00



**బృహజ్జాతకము – దశాధ్యాయీ వ్యాఖ్య**

**Bruhajjatakamu - Dashadhyaee Vyakhya**

ప్రథమ ప్రచురణ : 2006

**మేడవరపు సంపత్‌కుమార్**
4-399 'విశ్వామిత్ర' బిల్డింగ్
తారకరామా నగర్,
జగన్నాథపురం
కాకినాడ - 2
ఫోన్ : 2341878

గ్రంథ ముద్రణ :
**శ్రీ లక్ష్మీగణపతి ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్**
మెయిన్ రోడ్
కొవ్వూరు - 534 350
ఫోన్ : 231575

## దశాధ్యాయి యందు ఉదహరించబడిన గ్రంథములు

| | |
|---|---|
| 1. సాంబస్తుతి | 18. హరిదత్తః |
| 2. ఆర్యభటః | 19. గర్గః |
| 3. భగవత్పాదాచార్యులు | 20. మణిత్థః |
| 4. పరాశరుడు | 21. షట్ పంచాశిక |
| 5. సారావళి | 22. వాగ్భటుడు |
| 6. జాతక సంగ్రహం | 23. రత్నమాల |
| 7. బృహత్సంహిత | 24. సారసముచ్చయం |
| 8. వశిష్ఠ సంహిత | 25. విద్వజ్జనవల్లభం |
| 9. మనువు | 26. ఆర్యాసప్తతి |
| 10. భట్టోత్పలుడు | 27. గార్గిః |
| 11. కృష్ణాచార్యులు | 28. హోరాసార |
| 12. యవనేశ్వరుడు | 29. మాధవీయం |
| 13. శ్రీపతి | 30. శృతకీర్తి |
| 14. భాస్కరాచార్యులు | 31. జీవశర్మ |
| 15. సంగ్రామ విజయం | 32. సూర్యసిద్ధాంతం |
| 16. స్వల్పజాతకం | 33. ఇతరములు |
| 17. శ్రీధరపద్ధతి | |



## ప్రథమశ్లోక రహస్యం

★ "బృహజ్జాతకము"లోని ప్రథమశ్లోకము – సూర్యస్తుతి. దీనిని నిత్యమూ పఠించి, ధ్యానించిన 'భవిష్యజ్ఞానము' కలుగును.

ఈ శ్లోకమునందు మొదటి 3 పదములలోని అక్షరములలో "బృహజ్జాతక శ్లోక సంఖ్య" రహస్య సంకేతముగా ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ "మూర్తిత్వే పరికల్పితః శశభృతో"**

ఈ అక్షరములకు సంఖ్యలను "అకటపయ" సూత్రానుసారముగా ఇట్లు చూడవలయును.

1. మూ = 5, ర్తి = తవత్తుకు = 6, త్వే – వవత్తుకు = 4, సంఖ్యానాం వామతోగతిః అను సూత్రముచే ఇది – 465 అగును.
2. ప – 1, రి – 2, క 1 = 121 అగును, ల్పి – 1 తో – 6 = 16
3. శ – 5, శ, 5 = 55 = భృతః = కూడినది.

465 – 121 = 344 – 16 = 328 + 55 = 383

బృహజ్జాతక మందలి మొత్తం శ్లోకముల సంఖ్య = 383.

మరియొక విధముగా ఈ అక్షరముల సంఖ్యలను, యధాతథముగా నుపయోగించినచో 27 అధ్యాయముల శ్లోకసంఖ్య 372 వచ్చును. ఇది సూర్య భగవానుని అనుగ్రహముచే నాకు స్ఫురించినదిగా భావిస్తున్నాను. గమనించండి.

| | | |
|---|---|---|
| మూర్తిత్వే | = | 564 |
| పరిక | = | – 121 |
| ల్పిత | | 443 |
| | | – 16 |
| | | 427 |
| శశ | | – 55 |
| | | 372 |
| భృత | = | నిండియున్నది, ధరించబడియున్నది |

॥ గురుకృపాసిద్ధిరస్తు ॥

## సంజ్ఞాపనం

"బృహజ్జాతకం" జ్యోతిష శాస్త్ర గ్రంథములలో గురు స్థానీయము. శ్రీ మద్వరాహమిహిరాచార్యులవారు ఆనాటికి ఉన్న ప్రాచీనుల విజ్ఞానాన్ని బాగా మధించి జిజ్ఞాసువుల హితము కోరి మహాసముద్రాన్ని దాటడానికి ఒక చిన్న నావవలె ఈ బృహజ్జాతకం రచించినట్లుగా పేర్కొన్నారు.

ముఖ్యముగా జ్యోతిష శాస్త్ర గ్రంథములు సంస్కృతభాషలో నుండుట వలన, శాస్త్రపరిభాష, సాంప్రదాయార్ధవగతి లేనిదే సామాన్య సంస్కృత పండితులు అర్ధము చెప్పలేరు.

"స్వల్పవృత్త విచిత్రమర్థ బహుళం"గా ఈ గ్రంథం రచించినట్లు వరాహ మిహిరులు గ్రంధారంభంలోనే చెప్పారు.

విషయము ఒకటియే అయిననూ, ఆలోచనా విధానము అనేక విధములుగా ఉండునట్లు గంభీరమైన బృహజ్జాతకమునకు లోతైన అర్థ విశేషములు తెలియ జేయుటకు అనేక వ్యాఖ్యానములు వెలువడ్డాయి.

### సంస్కృతభాషలో 8 వ్యాఖ్యానములున్నవి

1) భట్టోత్పలుని – వివృతి వ్యాఖ్య
2) చంద్రిక – ఇది లభించుటలేదు
3) మితాక్షరి – దీనికే 'ముద్రాక్షరి' అని మరో పేరు.
4) శంకరాచార్యులు వ్రాసిన 'జయమంగళా వివృతి' లభించుటలేదు.
5) వివరణం – దేశమంగళ రుద్రుడు వ్రాసినది
6) పారమేశ్వరి – ఇది చిన్న వ్యాఖ్య లభించుచున్నది.
7) అపూర్వార్ధ ప్రకాశిక – లభించుచున్నది.
8) దశాధ్యాయి – గోవింద సోమయాజి వ్రాసినది.

"దశాధ్యాయి" వ్యాఖ్యానము, పేరుకు తగినట్లుగా మొదటి పది అధ్యాయములకు మాత్రమే వ్యాఖ్యానము వ్రాయబడినది. జ్యోతిషశాస్త్ర



గహన విషయమంతా ఇందు చర్చించబడింది. ఇది చాలా అపూర్వమైన అనుపమానమైన వ్యాఖ్య. దీని రచయిత కేరళలోని తిరూర్ దగ్గర 'తలక్కు లత్తూర్' గ్రామ వాసి అయిన 'గోవిందసోమయాజి" ఈయనకే 'భట్టత్తిరి' అని నామాంతరము కలదు.

'సారావళి' జ్యోతిషగ్రంథము, స్వతంత్ర గ్రంథమైననూ అది 'బృహజ్జాతకమునకు విశదమైన వివరణయే. దశాధ్యాయి యందు కూడా సారావళి నుంచి ఎక్కువగా శ్లోకములు ఉదహరించబడ్డాయి.

'ప్రశ్నమార్గ'మనే ప్రసిద్ధ ప్రశ్నశాస్త్ర గ్రంథమందు 'దశాధ్యాయీ వ్యాఖ్య' బహుధాప్రశంసించబడినది. 'దశాధ్యాయి' సంస్కృతభాషలో దేవనాగర లిపిలో 2005 వరకు ముద్రింపబడలేదు. మళయాళ లిపిలో 1990లో ముద్రించబడినది.

కేరళ రాష్ట్రములో దశాధ్యాయి వ్యాఖ్య మిక్కిలి ప్రచారములో నున్నది. బ్రహ్మశ్రీ చెరువిల్లి నారాయణ నంబూద్రిగారు ప్రాచీన తాళపత్ర గ్రంథములు పరిశీలించి సంస్కరించగా, "శ్రీసనాతన భారత భారతీ పాఠశాల" మైసూరువారు, **సంస్కృతలిపిలో 2005లో మొట్టమొదటి సారిగా దశాధ్యాయి ముద్రించారు.**

దశాధ్యాయీ వ్యాఖ్యానమువలన, జ్యోతిష పండితులకు, జ్యోతిష విద్యార్థులకు ఎన్నో విశేషములు తెలియును. ఒక గ్రహమునకు గూర్చి ఎంత సూక్ష్మముగా ఎలా అధ్యయనము చేసి ఫలితము చెప్పవచ్చునో, ప్రశ్నశాస్త్రము నందు కూడా ఇది ఎంతగా ఉపయోగించునో తెలియ జేయును.

'దశాధ్యాయి' తెలుగుభాషలో అనువదించడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

ఈ వ్యాఖ్యానము వలన విశేష ప్రతిపత్తి తప్పక కల్గును.

కాకినాడ
26-1-2006

**మేడవరపు సంపత్ కుమార్**

॥శివాయ గురవే నమః॥

శ్రీః

# "దశాధ్యాయీ" వ్యాఖ్యాన సహిత బృహజ్జాతక ప్రారంభః

## ప్రధమాధ్యాయః

## రాశిప్రభేదాధ్యాయః

శ్రీః

**శ్లో॥ మూర్తిత్వే పరికల్పితః శశభృతో వర్త్మాఽపునర్జన్మనాం**
**ఆత్మేత్యాత్మ విదాం క్రతుశ్చ యజతాం భర్తామరజ్యోతిషాం ।**
**లోకానాం ప్రళయోదయ స్థితివిభుశ్చానేకధాయః శృతా**
**వాచం న స్సదధాతు నైకకిరణః త్రైలోక్య దీపో రవిః ॥**

**వ్యాఖ్యానం - దశాధ్యాయీ :**

వరాహమిహిరాచార్యులవారు శాస్త్ర ప్రారంభంలో తన ఇష్టదేవత అయిన సూర్యుని "వాక్సిద్ధి" ఇమ్మని ప్రార్థిస్తున్నారు. తేజో శూన్యుడైన చంద్రుడు రవిరశ్మి సంపాతము వలన రూపవంతుడై వెలుగొందు చున్నాడు. జ్యోతిశ్చక్రమందు భూమి పశ్చిమాభిముఖముగా తిరుగుచున్నది. చంద్రాది గ్రహములు గోళరూపములై తూర్పుదిశగా తిరుగుచున్నవి. ప్రాంగ్ముఖగతుడై గోళరూపుడైన రవి కిరణ సంపాతము వలన సూర్యాభిముఖ్యములైన గోళముల అర్ధభాగము వెలుగుబొందుచున్నవి. ఇదియే పగలు - రాత్రి. ఆర్యభటులు ఇలా పేర్కొన్నారు.





**శ్లో॥ భూగ్రహభానాం గోళార్ధాని స్వచ్ఛాయయా వివర్ణాని**
**అర్ధానియధాసారం సూర్యాభిముఖాని దీప్యంతే ॥**

ప్రకృతిభూతుడైన జడాత్మకమైన చంద్రునికి మూర్తిత్వమును, చిదాత్మ అయిన పురుషభూతుడైన సూర్యుడు తన దృగ్వశమున చేతనత్వమును ఇచ్చుచున్నాడు.

మరొక అర్థము ఏమనగా మనోరూపుడు చంద్రుడు, అనగా, మనస్సు ఏ రూపమును ధ్యానించునో దానిని అనుగ్రహించువాడు మూర్తిగా కల్పించు వాడు సగుణబ్రహ్మఅయిన సూర్యుడు.

ముముక్షవులకు మోక్షమార్గము సూర్యుడు. స్థూల-సూక్ష్మ-పర, అని ఉపాసన 3 విధములు. నిరాకారుడైన పరమాత్ముని విగ్రహరూపునిగా పరికల్పించి మంత్రాంగన్యాసాదులచేత లేదా భగవత్సేవచేత చేయునదే స్థూలోపాసన. ఇది అధమాధికారులకు విధింపబడినది. మూలాధారాది, బ్రహ్మరంధ్ర పర్యంతం వ్యాపించియున్న కుండలినీ ఉపాసన సూక్ష్మోపాసనం. ఇది మధ్యమాధికారులకు విధింపబడినది. సచ్చిదానందరూప పరబ్రహ్మతానే అని భావించునది పరోపాసన. మరణ సమయమునందు ఏ మాత్రం తేజస్సును ధ్యానించినా తిరిగి శరీరమును పొందదు. సర్వతేజోమయుడు సూర్యుడు కావున ముముక్షువులకు మార్గమగుచున్నాడు. ఆత్మజ్ఞానులకు ఆత్మకరిష్ఠులకు కర్మఫలదాత. ఆకాశమందున్న గ్రహ నక్షత్రాదులకు తన ప్రభాయోగముచేత వాటికి ప్రభావము కల్గించును కావున దివ్యజ్యోతులకు భర్త అగుచున్నాడు. సృష్టి - స్థితి - లయములకు ప్రభువగుచున్నాడు. అనేక కిరణుడు - సహస్ర కిరణుడు. తన వేయి కిరణములలో 500 కిరణములచేత_భూమియందు పదార్థములలో శక్తిని కల్గించుచున్నాడు. 500 కిరణములతో ప్రకృతిని రక్షించుచున్నాడు.

**సంపత్కరీ వ్యాఖ్య :**

సూర్యుని సహస్రకిరణములలో 400కిరణములు వర్షమును 300 కిరణములు ఎండను 300కిరణములు మంచును వదలును. ఈ విషయము వైజయంతీ నిఘంటువులో నున్నది.

**శ్లో ॥ తాసాంశతాని చత్వారి రశ్మీనాం వృష్టి సర్జనే ।**
**శతత్రయం హిమోత్సర్గే తావత్ ఘర్మస్య సర్జనే ॥**

**త్రైలోక్యదీప :**

మూడులోకములకు వెలుగు నిచ్చువాడు భూత – భవిష్య – వర్తమానములను దర్శింపచేయువాడు.

**సంపత్కరీవ్యాఖ్య :**

ఈ శ్లోకమును నిత్యము ధ్యానించినచో వాక్సిద్ధి కలుగునని, గురుముఖముగా నాకుతెలిసినది. జ్యోతిషవేత్తలు ఈ శ్లోకపారాయణ చేయవలెనని మా పూర్వుల వాక్యము.

**2. శ్లో॥ భూయోభిః పటుబుద్ధిభిః పటుధియాం హోరాఫలజ్ఞప్తయే**
**శబ్దన్యాయ సమన్వితేషు బహుశశ్శాస్త్రేషు దృష్టేష్వపి ।**
**హోరాతంత్ర మహార్ణవప్రతరణే భగ్నోద్యమానాంఅహం**
**స్వల్పం వృత్తవిచిత్ర మర్ధబహుళం శాస్త్రప్లవం ప్రారభే ॥**

**దశాధ్యాయి :**

ఈ హోరాతంత్రము సముద్రమువంటిది. కనుకనే అపారము – గంభీరము – విస్తీర్ణము అగుచున్నది. మందమతులకు దాటశక్యము కానందునే తెప్పచే దాటుటకు వీలగునట్లు ఈ వ్యాఖ్య వ్రాయబడుచున్నది.





గ్రంధము స్వల్పమేఅయినను – అర్ధము బహుళముగానున్నది. విచిత్ర ఛందస్సులలో నిబద్ధము చేయబడినది. "అర్ధ" బహుళం = అనగా రత్నాది అనేక ప్రియ విషయములున్నవి. పూర్వుల శాస్త్రములందు బుద్ధి పటుత్వము గలవారికే అధికారమున్నది. సామాన్యులగు శిష్యులహితము కోరి ఈ వ్యాఖ్య వ్రాయబడుచున్నది.

పరాశర హోరయందు మైత్రేయుడు ఇట్లు చెప్పెను.

**శ్లో॥ సంకరాత్తు ఫలాంనాంచ గ్రహాణాం గతి సంకరాత్**
**నాన్యేయ మీదృశస్యేతి పరిచ్ఛేత్తుమలం నరాః ।**
**కలౌయుగే తతోల్పైవ బుద్ధిః పాపోత్తరా నరాః**
**తతో న చాస్య ప్రచయగమనం న ప్రయోజనం ।**
**ఆయుశ్చ లోకయాత్రాచ శాస్త్రేస్మిన్ ద్వేప్రయోజనే**
**నిశ్చేతుంకోను శక్నోతి వశిష్ఠో వా బృహస్పతిః**
**కింపున ర్మనుజాస్తత్ర విశేషాత్తు కలౌయుగే ।**

**సంపత్కరీ వ్యాఖ్య –**

వ్యాకరణ – తర్క బహుశాస్త్ర గ్రంధములు చదివిననూ జ్యోతిషశాస్త్ర సముద్రము దాటుటకు "ప్లవం" – నౌకగాని, పక్షి గమనము గాని అవసరము.

**3. శ్లో॥ హోరేత్యహోరాత్ర వికల్పమేకే**
**వాంఛంతి పూర్వాపర వర్ణలోపాత్ ।**
**కర్మార్జితం పూర్వభవే సదాది**
**యత్తస్య పక్తిం సమభివ్యనక్తి ॥**

**దశాధ్యాయి :**

అహోరాత్రములే అనగా పగలు – రాత్రి రెండూ హోరా అని చెప్పబడుచున్నవి. అహోరాత్ర శబ్దములో అ–త్ర వదిలినచో హోరా పదము ఏర్పడును. పూర్వజన్మమందు చేసిన కర్మఫలితము హోరాశాస్త్రము తెలియజేయును.

**సారావళి యందు -**

**శ్లో॥ జాతకమితి ప్రసిద్ధంయల్లోకే**
**తదిహ కీర్త్యతే హోరా ।**
**అథవా దైవ విమర్శన**
**పర్యాయీ ఖల్వయం శబ్దః ॥**

అహోరాత్రములు రాశి - నవాంశ - ద్వాదశాంశ - ద్రేక్కాణ హోరా - త్రింశాంశక మొ॥ భేదములతోను, గుళిక - యమకంటక, అర్ధప్రహరాది భేదముల చేతను శుభాశుభ ఫలములు తెలియవచ్చును.

సూర్యోదయము నుండి 8 దిక్కులందు సూర్య సంచారము వలన, శుభాశుభ ఫలితములు తెలియనగును.

**జాతక సంగ్రహము నందు :**

**శ్లో॥ దృఢాది కర్మత్రయ జాతమీశ్వరః**
**కాలస్వరూపః ప్రదదాతి దేహినాం।**
**ఫలత్రయంతత్ సదసద్విమిశ్రితం**
**తత్సంక్షయే సంక్షయకృత్త ధాపునః॥**

**సంహితయందు :**

**శ్లో॥ తంత్రే సుపరిజ్ఞాతే లగ్నే**
**ఛాయాంబు యంత్ర సంవిదితే।**
**హోరార్థే చసురూఢేన**
**ఆదేష్టుర్భారతీ వంధ్యా॥**

**4. శ్లో॥ కాలాంగాని వరాంగమాననమురో హృత్క్రోడవాసోభృతః**
**వస్తిర్వ్యంజనమూరు జానుయుగళే జంఘే తతోంఘ్రిద్వయం।**





**మేషాశ్విప్రథమా నవర్‌క్షచరణాః చక్రస్థితారాశయో**
**రాశిక్షేత్ర గృహర్‌క్షభాని భవనం చైకార్థ సంప్రత్యయే॥**

**దశాధ్యాయి :**

జ్యోతిషశాస్త్రము త్రిస్కంధ సమన్వితము. 1.గణితము 2.సంహిత 3.హోరా. ఈ హోరాస్కంధమునందు జాతక - ప్రశ్న - ముహూర్తములు చెప్పబడుచున్నవి. జాతక లక్షణముల చేతనే ప్రశ్న ఫలితములు నిరూపించ వలయును. జాతక ప్రశ్న భాగములు విడివిడిగా కృష్ణాది ఆచార్యులు గ్రంధములు రంచించారు.

జ్యోతిషశాస్త్రము పై విధముగా షడంగ సహితమని చెప్పబడినది.

బృహజ్జాతకము జాతకప్రధానముగానే చెప్పబడినది. ప్రశ్నకూడా ఈ శాస్త్రముచేతనే ఇందు సిద్ధించును.

జాతక - ప్రశ్నలకు కాలము ప్రధానమగుటచేత కాలపురుషుని లక్షణము ముందుగా చెప్పబడుచున్నవి.

అమూర్తమైన కాలమునకు, అవయవాది విభాగము ఎట్లు కుదురును? అను ప్రశ్నకు ఫల నిరూపణార్థము అంగవిభాగము కల్పించబడినది.

**కాలపురుషునకు :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | - | తల | తుల | - | పొత్తికడుపు |
| వృషభము | - | ముఖము | వృశ్చికము | - | మర్మావయవములు |
| మిధునం | - | భుజములు | ధనస్సు | - | తొడలు |
| కర్కాటకం | - | హృదయం | మకరం | - | మోకాళ్లు |
| సింహం | - | కడుపు | కుంభం | - | పిక్కలు |
| కన్య | - | నడుము | మీనం | - | పాదములు. |

దీని ప్రయోజనమేమనగా ఏ రాశిభాగమందు శుభగ్రహమున్నదో ఆ అవయవము పుష్టిగా – ఆరోగ్యముగా నుండును. పాపగ్రహ సంబంధమున్నచో బాధలు కలిగించును.

నష్టజాతకమునందు, ప్రశ్నయందు ఈ విభాగము ఉపకరించును.

మేషమునందు అశ్విని4 పాదములు భరణి4 పాదములు కృత్తిక1 పాదము కలసి – 9 పాదములతో 1 రాశి ఏర్పడుచున్నది.

కృత్తికయందలి3 పాదములు, రోహిణి4 పాదములు – మృగశిర2 పాదములు కలసి 9 పాదములతో వృషభరాశి ఏర్పడుచున్నది.

ఇట్లే మేషాది మీన పర్యంతము 27నక్షత్రములకు 4పాదముల చొప్పున 108పాదములతో భ.చక్రమేర్పడుచున్నది.

**ఆర్యభట్టు :**

**శ్లో॥ మేషాదౌః కన్యాంతం సమం**
**ఉదగప మండలార్ధమపయాతం ।**
**తౌల్యాదేర్మీనాంతం**
**శేషార్ధం దక్షిణేనైవం ॥**

మేష వృషభములు తూర్పు – మిధునం ఆగ్నేయం కటకసింహములు దక్షిణం – కన్యనైరుతి, తులా వృశ్చికములు పడమర, ధనుస్సు వాయవ్యం – మకర కుంభములు ఉత్తరం – మీనం – ఈశాన్యం॥

ప్రశ్నయందు పృచ్ఛకుని స్థితిననుసరించి ఉదయరాశి నారూఢముగా ఎంచి ప్రశ్నఫలితములు చెప్పవలయును. లేదా

ఒక ప్రదేశమునందు చతురస్ర రాశిచక్రము వ్రాసి అందు మేషాది రాశులను కల్పించి పృచ్ఛకుని చేత స్పృశింపచేసి, దానిని లగ్నముగా భావించి





ఫలితములు చెప్పవలయును. పృచ్ఛకుడు మనస్ఫూర్తిగా అడుగవలయును. పరీక్షించుటకు అడుగరాదు. అది ఫలించదు.

గ్రహములను – నక్షత్రములను జ్యోతిషవేత్త పూజించి చక్రము పరిశీలించ వలయును. వివాహప్రశ్నయందు బృహస్పతి కూడా ఇట్లే చెప్పెను.

నిశ్చయ జ్ఞానము కలుగుటకు లగ్నము – చంద్రరాశి – ఆ అధిపతులున్న రాశులు పరిశీలించవలయును.

ప్రశ్నయందు తత్కాలలగ్నము – ఆరూఢము – నవాంశరాశి – ఛత్రరాశి – పృచ్ఛకుడు స్పృశించిన అంగసంబంధ రాశి – చంద్రాధిష్ఠితరాశి ఈ ఆరూ పరిశీలించిన ఏకార్థ భావము కుదురును.

**సంపత్కరీ వ్యాఖ్య :**

ప్రశ్నకాల లగ్నాధిపతి ఏరాశిలోనుండెనో, ఆ రాశినుండి చంద్రుడున్న రాశి, అందున్న గ్రహములు జాతకుని ప్రశ్న ఏవిషయమో తెలియజేయును.

**5. శ్లో॥ మత్స్యౌఘటీ నృమిధునం సగదం సవీణం**
**చాపీ నరోఽశ్వజఘనో మకరో మృగాస్యః ।**
**తౌలీ ససస్యదహనాప్లవగా చ కన్యా**
**శేషాః స్వనామసదృశాః ఖచరాశ్చ సర్వే ॥**

**దశాధ్యాయి :**

మేషాది 12 రాశులు కేవలం సంజ్ఞామాత్రములేకాదు. వాటి స్వరూపము ననుసరించి ఖగోళమునందు గోచరించును. స్వభావాది గుణములు తదను గుణముగనే యుండును. ముందుగా మీనరాశి రెండుచేపల ఆకృతి గలది. కుంభరాశి భుజమునందు రిక్తఘటమును ధరించిన పురుషుడు. మిధునరాశి ఇరువురు స్త్రీ పురుషులు గదను – వీణను ధరించియుంటారు. ధనురాశి

ధనుర్ధరుడైన పురుషుడు గుర్రపునడుము కలిగియుంటాడు. మకరరాశి పూర్వభాగము మృగాకృతి వెనుకభాగము మొసలి ఆకారము కలది. తులారాశి త్రాసును ధరించిన పురుషుడు కలది. కన్యారాశి నౌకయందు ఒక స్త్రీ వరికంకెను - జ్వాలను ధరించియుండునది.

మిగిలిన రాశులు అనగా మేష - వృష - సింహ - కర్కట - వృశ్చిక రాశులు, ఆయా ఆకృతులు కలిగినవి. వీటి రూపమునకు తగిన స్వభావము కల్గినవి. ఇదే విషయము సారావళియందు కళ్యాణవర్మ పేర్కొనియున్నాడు.

"స్వచరాశ్చ సర్వే" అనుచోట స్వచరాః తమతమ స్థానములందు సంచరించునవి. అంతేగాక "చర గతి భక్షణయోః" అనిధాతువు. కనుక తమతమ భక్షణ విధానము కల్గినవి. మేషము చేదు - వేడి చేయు పదార్ధములను భుజించునది. వృషభము గడ్డిమేయును. మిధునము అన్నపాన భక్షణ గలది. కర్కాటము చేపలు తినును. సింహము మృగమాంస భక్షణ చేయును.

స్వభావము కూడా అటువంటిదే. మేషము సంచారశీలి. త్వరగాతినును. విరిగిన గోళ్లుగలది. నీటిభయం - కామి అగుచున్నది.

వృషభము మందగామి - పెద్దనోరు - మంచి జఠరాగ్ని కలది - బాధలను సహించునది.

మిధునము - గీతవాద్య కళల యందు కుశలత - రతికౌశలము - హాస్యచతురత - తిండిపోతు.

కర్కాటకము వక్రగమనము - జలప్రీతి - రహస్య గోపన కుశలత కలిగియుండును.

సింహము పెద్దనోరు - స్త్రీద్వేషము - తీవ్రప్రకృతి - మాంసభక్షణ ప్రీతి - ఏకాంతవాసము - ఉదరదంతరోగములు - గర్వము - ఆకలి దప్పికలు ఎక్కువ.





కన్య సురతప్రీతి - సిగ్గు - పరగృహవాసము - ప్రియభాషణము.

తుల క్రయవిక్రయ కౌశలం - చిక్కిన దేహము - ధనవంతులు - వ్యాపారదక్షత -

వృశ్చికము విషస్వభావము - శీఘ్రగమనము - క్రూరచేష్టలు -

ధనుస్సు పొట్టిశరీరము - రాజ సన్నిధియందుండుట - సహాయము నర్థించుట - యుద్ధప్రీతి - ధనుస్సు రెండవభాగముందు కోలముఖం - పెద్దపళ్లు - వీర్యవంతులు -

మకరము నడుము కిందిభాగము కృశించియుండును. అందమైన నేత్రములు - అల్పస్ఫిక్ (చిన్నపిర్రలు) శీతల స్వభావము.

కుంభము చిన్నముఖము - నీటియందు మక్కువ - విశాల దేహము - బరువు మోయుట. గంభీరహృదయము మొ॥

మీనము అందమైనదేహము - భారీదేహము - జలచర ద్రవ్యభోక్త. మంచి నేత్రములు - సాధు స్వభావము అగును.

మేషాది జంతువుల 12 రాశుల స్వభావములు - ఇతర విషయములు శాస్త్రమువల్ల - లోకజ్ఞానము వల్ల తెలుసుకొని ఫలనిరూపణయందు అను సంధానము చేయవలయును.

ఈ విషయము కృష్ణాచార్యులు కూడా ఈ విధముగానే పేర్కొనెను.

ముందుగా మీనరాశిని పేర్కొనుటవల్ల వెనుకనుంచి చెప్పినను, కొన్ని సమయము లందు విలోమపద్ధతి ఫలనిర్ణయములో అనుసరించ వలసి యుండును.

శేషాఃస్వనామ సదృశాః - అని చెప్పుట వలన, ప్రశ్న చెప్పునపుడు జ్యోతిషవేత్త వినినది - చూచినది, లేదా మనసుకు కంటికి ఆనందము కలిగించునది ఆ సమయమునందు శుభశకునముగా గ్రహించవలయును. భట్టోత్పలుడు కూడా ఇట్లు చెప్పెను.

**శ్లో॥ దృంగ్మనసోః ప్రీతికరంప్రశ్నే సందర్శనం యదిశ్రవణం ।**
**మాంగలిక ద్రవ్యాణాం భవతి శుభం నిర్దిశేత్తత్ర ॥**

ప్రశ్నచెప్పునపుడు ఏఏ శబ్దములు క్రియావాచికములు - పదార్థ వాచికములు శుభాశుభవిషయములు గోచరించునో అన్నిటిని అనుసంధానించి ఆలొచించవలయును.

ప్రశ్నకాలమందు కట్టెలుకొట్టుట గోచరించినచో ఆ ప్రశ్న ఫలితము వినాశకరముగనే భావించవలయును. గర్భప్రశ్నయందు అడుగువాడు పురుషపదముచ్చరించినచో, పుత్రజననము కలుగునని తెలియవలయును.

## సంపత్కరీ వ్యాఖ్య :

**6. శ్లో॥ క్షితిజసితజ్ఞ చంద్రరవిసౌమ్య సితావనిజాః**
**సురగురుమంద సౌరి గురవశ్చ గృహాంశకపాః ।**
**అజమృగతౌళి చంద్ర భవనాది నవాంశవిధిః**
**భవనసమాంశకాధిపతయః స్వగృహత్క్రమశః ॥**

## దశాధ్యాయి :

ఇపుడు రాశ్యధిపతులను చెప్పుచున్నాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషమునకు | - | కుజుడు | తుల | - | శుక్రుడు |
| వృషభము | - | శుక్రుడు | వృశ్చికం | - | కుజుడు |
| మిధునం | - | బుధుడు | ధనుస్సు | - | గురుడు |
| కర్కాటకం | - | చంద్రుడు | మకరం | - | శని |
| సింహం | - | సూర్యుడు | కుంభం | - | శని |
| కన్య | - | బుధుడు | మీనం | - | గురుడు. |





నవాంశవేయునపుడు, మేష - కటక - తులా, మకరములు ప్రధమముగా ప్రారంభమగును. సారావళియందు ఇదే చెప్పబడినది.

రాశియొక్క అధిపతి బలంగాయున్నపుడు ఆరాశి భావము బలంగా యుండును.

"సురగురుసౌరి మందగురవశ్చ" అని మీనరాశి అధిపతి గురునినుంచి వెనుకకు విలోమక్రమములో చెప్పుటవలన ఇచ్చుట సృష్టిక్రమము సూచించ బడినది.

| | | | | |
|---|---|---|---|---|
| మీనరాశి | - | గురుధపతి | - | గురుడు ఆకాశభూతము |
| కుంభరాశి | - | శని | - | వాయుభూతము |
| వృశ్చికము | - | కుజుడు | - | అగ్నిభూతము |
| తుల | - | శుక్రుడు | - | జలభూతము |
| కన్య | - | బుధుడు | - | పృధివీభూతము. |

పై విధముగాని సృష్టిక్రమము జరిగినట్లు వేదమునందు ఉల్లేఖించబడినది.

"ఆకాశద్వాయుః, వాయోరగ్నిః - అగ్నేరాపః - ఆపఃపృధివీ - పృధివ్యాం ఓషధయః।.....

మకర - ధనుస్సురాశులు - కుంభ - మీనములకు జంటరాశులు కనుక మరల పేర్కొనలేదు.

కాలచక్రదశాక్రమము కూడా ఇచ్చుట సూచించబడినది.

క్షితిజాది ఎనిమిది గ్రహములకు ఒక సమాసము. సురగుర్వాది 4 గ్రహములకు ఒక సమాసము దీనివలన తెలియనదేమనగా దక్షిణ నక్షత్రములలో మేషాదిమీనాంతం ఒక క్రమముగా గణించవలయును. వృశ్చికాది ధను రాశ్యంతం విలోమముగా గణించవలయును. వామనక్షత్రములలో ధనురాశి

నుంచి వృశ్చికాంతము, మీనాది మేషాంతముగాను గణించవలయును. అందుచేతనే "సురగురుమందసౌరి గురవశ్చ" అని నాలుగింటికే పృథక్ సమాసము రచింపబడినది.

**7. శ్లో॥ కుజరవిజ గురుజ్ఞ శుక్రభాగాః**
**మపవసమీరణ కౌర్పిజూకలేయాః ।**
**అయుజియుజితుతే విపర్యయస్థాః**
**శశిభవనాళి ఝషాంతమృక్ష సంధిః ॥**

## దశాధ్యాయి :

ఇందు త్రింశాంశ గూర్చి వివరించబడినది. బేసిరాశులందు కుజ5 శని5 గురు8 బుధ 7 శుక్రులు 5 భాగలువరుసగా ఆధిపత్యము పొందెదరు. సరిరాశులందు వెనుకకు శుక్రునినుంచి కుజుని వరకు లెక్కించవలయును.

వీటివలన భోజనవిధి - శయనము - మైధునము జాతిశ్రేష్ఠత ఫలితము తెలియనగును.

కర్కాటక - వృశ్చిక - మీన అంత్యభాగలు "ఋక్షసంధి" అనబడును. వీటినే గండాంతము లందురు.

## సారావళియందు :

**శ్లో॥ జాతోనజీవతినరో మాతురపథ్యో భవేత్ స్వకులహంతా ।**
**యదిజీవతి గండాంతే బహుగజతురగో భవేత్ భూపః ॥**

అని ఫలితము చెప్పబడినది.

**8.శ్లో॥ క్రియతావురుజుతు మకులీరలేయ**
**పార్థోనజూక కౌర్పాఖ్యాః ।**
**తౌక్షిక ఆకోకేరో హృద్రోగః**
**చ ఇత్థ సిః క్రమశః ॥**





## దశాధ్యాయి :

మేషాది 12 రాశులకు నామాంతరములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషం | - | క్రియ | తుల | - | జూక |
| వృషభం | - | తావురి | వృశ్చికం | - | కౌర్పి |
| మిధునం | - | జితుమ | ధనుస్సు | - | తౌక్షిక |
| కర్కాటకం | - | కులీర | మకరం | - | ఆకోకేర |
| సింహం | - | లేయ (Leo) | కుంభం | - | హృద్రోగం |
| కన్య | - | పాథోన | మీనం | - | ఇత్థసి |

మేషమునుంచి వృశ్చికము వరకు 8 ఒకే సమాసము చెప్పి ధనుస్సు నుంచి మీనము వరకు 4 వేరొక సమాసములో చెప్పుటవలన, ఆత్మాది అష్టభావములు ధర్మాది చతుర్భావ సాపేక్షికములు.

ఆత్మభావమునకు అనగాలగ్నమునకు - 9వ స్థానము ధర్మ సాపేక్షము 2వ స్థానమునకు అనగా ధనాగమమునకు 10ప్రవృత్తిసాపేక్షము - 3వ స్థానము పరాక్రమమునకు 11లాభసాపేక్షము - 4సుఖస్థానమునకు - 12ధన వ్యయసాపేక్షము, 5వస్థానము సంతానసిద్ధికి మరల 9ధర్మసాపేక్షము 6వస్థానం శతృక్షయమునకు 10 ప్రయత్నసాపేక్షము 7వస్థానం కళత్రసుఖమునకు 11అర్థాగమలాభసాపేక్షము. 8మరణరోగపరాభవములకు 12 ధననాశ సాపేక్షములు ఇక్కడ సూచించబడినవి.

**9. శ్లో॥ ద్రేక్కాణహోరా నవభాగసంజ్ఞాః**
**త్రింశాంశక ద్వాదశ సంజ్ఞితాశ్చ ॥**
**క్షేత్రంచయద్యస్యచ తస్యవర్గో**
**హోరేతిలగ్నం భవనస్య చార్థమ్ ॥**

**దశాధ్యాయి :**

లగ్నమునకు షడ్వర్గు చెప్పబడినది. లగ్నము - హోర - ద్రేక్కాణము - నవాంశ - త్రింశాంశ ద్వాదశాంశ. ఇవి షడ్వర్గు అనబడును.

లగ్న - చంద్రరాశులలో బలమైన రాశికి షడ్వర్గు గణించి జాతక - ప్రశ్నవిషమయులందు ఫలితము చక్కగా నిరూపించవచ్చును.

నవాంశ అనగా నవప్రాణాత్మకము. ప్రాణ - అపాన - వ్యాన- ఉదాన - సమాన - నాగ - కూర్మకృకల - దేవదత్త వాయువులు9. ధనంజయమను మరొక వాయువు కలదు. కాని అది ప్రాణములేని శరీరమును ఉబ్బుగాచేయును.

ద్వాదశాంశ అనగా 5జ్ఞానేంద్రియములు 5కర్మేంద్రియములు. మనస్సు - బుద్ధి - కలసి12.

నవప్రాణములతో ద్వాదశ ఇంద్రియములతో 21తో సూక్ష్మ శరీర ముండును.

కొందరు రాశి స్థూలశరీరమని - ద్రేక్కాణము ఉర్ధ్వ - మధ్యమ - అధోభాగమని - హోర, కుడి - ఎడమభాగములని - నవాంశ ఆత్మయని - ద్వాదశాంశలు వాయుమనోబుద్ధులని - దేహమందారోపించి ఫలనిరూపణ చేయుచున్నారు.

**10. శ్లో॥ గోజాశ్వి కర్కిమిథునాః సమృగా నిశాఖ్యాః**
**పృష్ఠోదయాః విమిథునాః కథితాస్తఏవ ।**
**శీర్షోదయా దినబలాశ్చ భవంతి శేషా**
**లగ్నం సమేత్యుభయతః పృథురోమయుగ్మమ్ ॥**

**దశాధ్యాయి :**

మేష - వృషభ - మిధున - కటక - ధను - మకరరాశులు రాత్రియందు బలముకలవి. మిధునము తప్ప మిగిలిన 5పృష్ఠోదయరాశులనబడును.





సింహ - కన్యా - తులా - వృశ్చిక - కుంభరాశులు పగటియందు బలముకలవి. వీటితో మిధునము చేర్చిన శీర్షోదయరాశులనబడును. మీనం ఉభయోదయరాశి అనబడును. శీర్షోదయరాశులు శుభప్రదములు - శీఘ్రముగా ఫలించునవి. పృష్ఠోదయరాశులు అశుభఫలితము నిచ్చును.

జాతక - ప్రశ్నయందు వీటిప్రయోజనమెంతయో ఉన్నది.

**కృష్ణీయమందు :**

**శ్లో॥ పృష్ఠోదయేషు సిధ్యత్యశుభం**
**మూర్ధోదయేషు శుభయుక్తం ।**
**ఉభయోదయే విమిశ్రం**
**గ్రహరహితేభ్యః ఫలంవాచ్యమ్ ॥**

శీర్షోదయ రాశులలో నున్నగ్రహములు దశాప్రారంభములోను - పృష్ఠోదయరాశులలోనున్న గ్రహములు దశాచివరి భాగములోను, ఉభయోదయ రాశి అనగా మీనములో నున్న గ్రహదశ మధ్యభాగములోను ఫలితమునిచ్చును.

**11. శ్లో॥ క్రూరస్సౌమ్యః పురుషవనితే తే చరాగద్విదేహాః**
**ప్రాగాదీశాః క్రియవృషనృయుక్ కర్కటాః సత్రికోణాః ।**
**మార్తాండేంద్వోః అయుజి సమభేచంద్రభాన్వోశ్చహోరే**
**ద్రేక్కాణాస్స్యుః స్వభవనసుత త్రిత్రికోణాధిపానామ్ ॥**

**దశధ్యాయి :**

బేసిరాశులు క్రూరస్వభావము గలవి. సరిరాశులు సౌమ్యస్వభావము గలవి. బేసిరాశులు పురుషరాశులు, సరిరాశులు స్త్రీరాశులు అనబడును.

ఆయారాశుల యందు జన్మించిన వారి ప్రకృతి ఆయావిధముగానుండును. పురుషరాశులందు జన్మించిన వారు తేజస్సుగాను, స్త్రీరాశులందు జన్మించినవారు మృదుత్వము కలిగియుందురు.

సురతపశ్నయందు బేసిరాశులలో విషమసఖ్యత, సరిరాశులలో సమసఖ్యత చెప్పవలెను.

సర్వపదార్థములకు బేసిరాశులలో క్రూరత్వము, సరిరాశులలో సౌమ్యత్వము చెప్పవలెను.

| | | | | |
|---|---|---|---|---|
| చరరాశులు | - మేష | - కటక | - తులా | - మకరములు |
| స్థిరరాశులు | - వృషభ | - సింహ | - వృశ్చిక | - కుంభములు |
| ద్విస్వభావరాశులు | - మిధున | - కన్యా | | ధనుర్మీనములు. |

చరరాశులందు జన్మించినవారు సంచారశీలురు. స్థిరరాశియందు జన్మించిన వారు స్థిరముగా నుండుటకు ఇష్టపడువారుఅగుదురు. ద్విస్వభావములో జన్మించినవారు మిశ్రస్వభావము గలవారగుదురు.

ప్రశ్నయందు గూడ ఇట్లే చూడవలెను.

| | | | |
|---|---|---|---|
| తూర్పుదిశ | - మేష | - సింహ | - ధనుస్సులు |
| పడము | - మిధున | - తులా | - కుంభములు |
| దక్షిణదిశ | - వృషభ | - కన్యా | - మకరములు |
| ఉత్తరదిశ | - కర్కట | - వృశ్చిక | - మీనములు. |

బేసిరాశులందు మొదటిదిసూర్యహోర రెండవది చంద్రహోర అగును. సరిరాశులలో మొదటిది చంద్రహోర, రెండవది సూర్యహోర అగును.

రాశిని 3 భాగములు చేయగా 10 భాగలకు ఒక ద్రేక్కాణమగును. ఈ 3 ద్రేక్కాణములకు 1-5-9 అధిపతులు ద్రేక్కాణాధిపతులగుదురు.

మరణవిషయములో 22వ ద్రేక్కాణముననుసరించి మరణకారణము తెలియును.





ప్రశ్నవిషయములో చోరుడు ద్రేక్కాణముననుసరించి, లగ్నాంశము ననుసరించి చౌర్యద్రవ్యవిషయము తెలియవలెను.

27వ అధ్యాయములో ద్రేక్కాణముల ఆకారము, వాటిఆయుధ వివరము వర్ణించబడినది.

**12. శ్లో॥ కేచిత్తు హోరాం ప్రథమాంభపస్య**
**వాంఛంతి లాభాధిపతే ర్ద్వితీయం ।**
**ద్రేక్కాణ సంజ్ఞామపి వర్ణయంతి**
**సద్వాదశైకా దశ రాశిపానామ్ ॥**

## దశాధ్యాయి :

యవనులు కొందరు 2 హోరలలో ఒకటి అదేరాశియందును, రెండవది 11వ రాశిగాను చెప్పుదురు. ద్రేక్కాణ విషయములో కూడా 3 ద్రేక్కాణములు 1-12-11 అధిపతులుగా చెప్పుచున్నారు.

ఈ యవనమతము వరాహమిహిరులకు అంగీకారము కాదు. సత్యాచార్యులు కూడా వరాహమిహిరుల వలెనే పూర్వకాలమందు చెప్పిరి.

శ్లోకమందు 'తు' అని ఉండుటచేత 3ద్రేక్కాణములు విధాన-జాతక-ప్రశ్నలందు 3ప్రకారములుగా నుండునని కొందరి మతము. ఈ విషయములో గురుముఖముగా గ్రహించి సంప్రదాయము ననుసరించవలయును.

**13. శ్లో॥ అజవృషభమృగాంగనా కుళీరాః**
**ఝషవణిజేచ దివాకరాదితుంగాః ।**
**దశశిఖిమనుయుక్తి థీంద్రియాం శైః**
**త్రినవక వింశతిభిశ్చ తేఽ_స్తనీచాః ॥**

**దశాధ్యాయి :**

గ్రహములకు ఉచ్ఛనీచస్థానములు.

| | | | |
|---|---|---|---|
| సూర్యుడు | మేషముఉచ్ఛ | 10భాగలుపరమోచ్ఛ | తులనీచ |
| చంద్రుడు | వృషభంఉచ్ఛ | 3భాగలుపరమోచ్ఛ | వృశ్చికంనీచ |
| కుజుడు | మకరంఉచ్ఛ | 28భాగలుపరమోచ్ఛ | కటకంనీచ |
| బుధుడు | కన్యఉచ్ఛ | 15భాగలుపరమోచ్ఛ | మీనంనీచ |
| గురుడు | కటకంఉచ్ఛ | 15భాగలుపరమోచ్ఛ | మకరంనీచ |
| శుక్రుడు | మీనంఉచ్ఛ | 27భాగలుపరమోచ్ఛ | కన్యనీచ |
| శని | తులఉచ్ఛ | 20భాగలుపరమోచ్ఛ | మేషంనీచ. |

**కృష్ణీయమందు :**

**శ్లో॥ సుఖినః ప్రకృష్టకార్యాః**
**రాజప్రతిరూపకాశ్చ రాజానః ।**
**ఏకద్విత్రి - చతుర్భిర్జాయంతే**
**అతఃపరం దివ్యాః ॥**

**14. శ్లో॥ వర్గోత్తమాశ్చరగృహాదిషు పూర్వమధ్య**
**పర్యంతతః సుశుభదా నవభాగసంజ్ఞాః ।**
**సింహోవృషః ప్రథమషష్ఠ హయంగతౌళి**
**కుంభాస్త్రికోణభవనాని భవంతి సూర్యాత్ ॥**

**దశాధ్యాయి :**

చరరాశులకు మొదటి నవాంశ – స్థిరరాశులకు ఐదవనవాంశ – ద్విస్వభావ రాశులకు తొమ్మిదవ నవాంశ "వర్గోత్తమం" అనబడును. వర్గోత్తమం పొందిన గ్రహము శుభఫలితమునిచ్చును.





సూర్యునకు సింహము త్రికోణరాశి చంద్రునకు వృషభము – కుజునకు మేషము – బుధునకు కన్య – గురునకు ధనుస్సు – శుక్రునకు తుల – శనికి కుంభము త్రికోణరాశులనబడును. మిగిలిన రెండవరాశులు స్వక్షేత్రములగును. సూర్యచంద్రులకు రెండవ స్థానములేదు.

**15. శ్లో॥ హోరాదయస్తనుకుటుంబ సహోత్థబంధు**
**పుత్రారిపత్ని మరణాని శుభాస్పదాయాః ।**
**రిః ఫాఖ్యమిత్యుపచయాన్యరి కర్మలాభ**
**దుశ్చిక్యసంజ్ఞిత గృహాణిన నిత్యమేకే ॥**

**దశాధ్యాయి :**

12 రాశులకు క్రమముగా 12 పేర్లుకలవు. లగ్నమునకు తనుభావమని – ద్వితీయమునకు కుటుంబము – తృతీయమునకు సహోదర – చతుర్థమునకు బంధు స్థానమని – పంచమమునకు పుత్రస్థానమని – షష్ఠస్థానమునకు శతృస్థానమని – సప్తమమునకు పత్నీస్థానమని – అష్టమమునకు మరణమని – నవమమునకు శుభమని – దశమమునకు ఆస్పదమని – ఏకాదశమునకు ఆయమని – ద్వాదశమునకు రిఃఫమని పేర్లుకలవు.

3–6–10–11 స్థానములు ఉపచయ స్థానములనబడును. అయితే కొందరు ఇవి నిత్యముగావని అభిప్రాయపడిరి. ఇది వరాహమిహిరు లంగీకరించలేదు.

జన్మకాలమునకు ఉదయలగ్నము గణించవలయును. మధ్యమ లగ్నము (దశమము) – ఈ రెండింటికీ సప్తమస్థానములు – సప్తమం – చతుర్థం – ఈ నాలుగింటినీ లగ్నచతుష్టయం అంటారు.

మిగిలిన భావములను శ్రీపతిపద్ధతిలో గణించవలయును.

**శ్రీపతి :-**

శ్లో॥ జ్ఞేయోత్ర ప్రథమం హి జన్మసమయ
చాయాంబు యంత్రైః స్ఫుటః ॥

16. శ్లో॥ కల్యస్వ విక్రమగృహ ప్రతిభాక్షతాని
చిత్తోత్థ రంధ్ర గురుమాన భవవ్యయాని।
లగ్నాచ్చతుర్థ నిధనే చతురస్ర సంజ్ఞే
ద్యూనంచ సప్తమగృహం దశమర్క్షమాజ్ఞా॥

**దశాధ్యాయి :**

లగ్నాది భావములకు నామాంతరములు – లగ్నమునకు కల్యము – ద్వితాయమునకు స్వం – తృతీయమునకు విక్రమం – చతుర్థమునకు గృహం – పంచమమునకు ప్రతిభ – షష్ఠమమునకు క్షతము – సప్తమమునకు చిత్తోత్థము – అష్టమమునకు రంధ్రము – నవమమునకు గురువు – దశమమునకు మానము – ఏకాదశమునకు భవము – ద్వాదశమునకు వ్యయము అనిపేర్లు కలవు.

చతుర్థమునకు చతురస్రమని – దశమమునకు ఆజ్ఞ అని కూడాకలవు.

లగ్నాది ఆరుభావములు ఒకే పదముచే చెప్పబడినవి. ఇవి అదృశ్య భావములు. సప్తమాది ఆరు భావములు దృశ్యభావములని సూచించబడినది.

ఇతర శాస్త్రములనుండి కూడా ద్వాదశ భావములను పర్యాయములను తెలుసుకొనవలెను.

**పరాశరుడు :**

శ్లో ॥ లగ్నాత్ శరీర చింతాస్యాత్ ద్వితీయాత్ స్వంచపైతృకం।
భరణీయజనంవాచం పశ్వాదిచ వదేద్ బుధః





తృతీయాత్ సోదరాన్ బుద్ధిం దుష్ప్రార్వాం విక్రమంవిదుః।
చతుర్థాన్మాతరం వేశ్మ సుఖం లాలిత్యమేవచ
సౌమనస్యమపత్యాది ప్రజ్ఞాం మేధాంచ పంచమాత్।
ఆధివ్యాధి మరింషష్ఠాత్ మైధునంస్త్రీ జయంతతః
మృతింపరాజయం దుఃఖం హానింవ్యాధిం తథాష్టమాత్
సౌశీల్యం భాగ్యధర్మంచ నవమాద్దశమాత్తథా
మానాస్పదాజ్ఞా కర్మాణిలాభాల్లాభం వ్యయాద్వ్యయం॥

**జాతక సంగ్రహమందు :**

శ్లో॥ లగ్నాత్‌చింత్యం మూర్తికీర్తి స్థితించ
విత్తంనేత్రం వాక్ కుటుంబంచ విత్తాత్
ధైర్యం వీర్యం భ్రాతరం విక్రమేణ
విద్యాత్‌క్షేత్రం వాహనం బాంధవాంశ్చ।
బంధుస్థానాన్మాతులం భాగినేయం
తోయంవేశ్మా జీవికాద్యం సుఖంచ
బుద్ధింపుత్రం పూర్వపుణ్యంత్వమాత్యం
పుత్రాత్, వ్యాధింఛాత్రవాద్వింగ్ వ్రణాదీన్।
మదనగమన జాయాలోకనాన్యస్తభాత్స్సుః
మరణహరణ దాసక్లేశవిఘ్నాని రంధ్రాత్
గురుజన పరపుణ్యాన్యౌషధం భాగ్యసిద్ధిం
నవమభవనతః స్యాన్మాన కర్మాస్పదాద్యం
సర్వావాప్తిః దుఃఖహానిర్భవాఖ్యాద్రిః ఫాద్రిఃఫం
స్వక్షయం భ్రంశమేవ॥

మరియొక చోట ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ యోయోభావః స్వామిదృష్టోయుతోవా**
**సౌమ్యైర్వా స్యాత్తస్య తస్యాభివృద్ధిః ।**
**పాపైరేవం తస్యభావస్య హానిః**
**నిర్దేష్టవ్యా పృచ్ఛతో జన్మతోవా ॥**

వరాహ మిహిరులు - చంద్రుని నుంచి కూడా ద్వాదశ భావములు పరిశీలించ వలయునని ముందు చెప్పబోవుచున్నారు.

**శ్లో॥ చంద్రాదాయది సంపదస్తి హె**
**తయోర్జేయోఽన్యథాఽసంభవః ॥** అని.

**17. శ్లో॥ కంటక కేంద్ర చతుష్టయ సంజ్ఞాః**
**సప్తమలగ్న చతుర్థ ఖభానాం ।**
**తేషుయథాభి హితేషు బలాఢ్యాః**
**కీటనరాంబుచరాః పశవశ్చ ॥**

**దశాధ్యాయి :**

లగ్న - చతుర్థ - సప్తమ - దశమ - భావములకు కంటకములని - కేంద్రములని - చతుష్టయములని పేర్లుకలవు.

లగ్నము నరరాశులు అయినచో బలవంతములగును. అనగా మిధున - కన్యా - తుల - ధనుస్ పూర్వార్థ - కుంభరాశులు.

చతుర్థము జలరాశులయిన, అనగా కర్కాటక మకరోత్తరార్థ మీనములు బలవంతములు.

సప్తమము వృశ్చికమైనచో బలకరము.

దశమము చతుష్పద రాశులయినచో అనగా మేష - వృషభ - ధనుస్సు ఉత్తరార్థ - సింహములైనచో బలవంతములు.





ఇట్లు పరికించి చూడగా సప్తమమందున్న గ్రహములు లగ్నములో బలహీనములు.

**18. శ్లో॥ కేంద్రాత్ పరం పణపరం పరతస్తుతద్వత్**
**ఆపోక్లిమం హిబుకమంబు సుఖంచవేశ్మ ।**
**జామిత్రమస్త భవనం సుతభంత్రికోణం**
**మేషూరణం దశమమత్ర చకర్మ విద్యాత్ ॥**

**దశధ్యాయి :**

కేంద్రములకు ప్రక్కనుండు రాశులు, అనగా 2-5-8-11 పణపరములని పిలువబడును. వీటికి ప్రక్కనుండు రాశులకు అనగా 3-6-9-12 ఆపోక్లీమ ములనబడును. చతుర్థరాశికి హిబుకము-అంబు-సుఖం-వేశ్మ అను పర్యాయపదములు కలవు.

సప్తమరాశికి జామిత్రం-అస్తభవనమని పర్యాయపదములు. పంచమరాశికి సుతభము-త్రికోణమని-దశమరాశికి మేషూరణం-కర్మయని పేర్లు.

కేంద్ర-పణపర-ఆపోక్లీమములందున్న గ్రహములు, వరుసగా బాల్య-యౌవన-వార్థక్యము లందు ఫలితములనిచ్చును.

సారావళియందు ఇదే చెప్పబడినది.

ప్రశ్న-జాతకములందుకూడా విషయ విభాగము బాగుగా విమర్శించి ఫలనిరూపణ చేయవలెను.

**19.శ్లో॥ హోరాస్వామిగురుజ్ఞ వీక్షితయుతా నాన్యైశ్చ వీర్యోత్కటా**
**కేంద్రస్థా ద్విపదాదయోహ్ని నిశిచ ప్రాప్తేచ సంధ్యాద్వయే ।**
**పూర్వార్ధే విషయాదయః కృతగుణామానం ప్రతీపంతతో**
**దుశ్చిత్కం సహజంతపశ్చ నవమంత్ర్యాద్యం త్రికోణంచతత్ ॥**

## దశాధ్యాయి :

ఇందు దృష్టిబలం-లగ్నబలం-స్థానబలం-కాలబలం-చెప్పబడుచున్నవి. బలముననుసరించియే ఫలముండును.

లగ్నము లగ్నాధిపతి చేత లేదా గురుబుధుల చేత చూడబడిన బలవంత మగును. లగ్నమందు లగ్నాధిపతి లేదా గురుబుధులలో ఎవరున్నా ఆ లగ్నము బలపూర్ణమగును. వీరికి ఇతరగ్రహ సంబంధముండరాదు. గురు-బుధ - లగ్నాధిపతి వర్జితమైన లగ్నము, ఇతర గ్రహ దృగ్గోచరాది సంబంధము కలదైనచో అది నిర్బలమని గ్రహించవలయును.

కేంద్రములందున్న గ్రహములు బలవంతులు-పణపరములందున్న గ్రహములు మధ్యమము-ఆపోక్లీమమందున్న గ్రహములు స్వల్పబలము కలవి అగును.

లగ్న-దశమ-సప్తమ-చతుర్ధమందున్న గ్రహములు వరుసగా-నర-చతుష్పద-కీట-జలరాశులందు బలవంతులు. ఇందు ద్విపదరాశులు పగటియందు-చతుష్పదరాశులు రాత్రియందు-కీట-జలరాశులు సంధ్యా ద్వయములందు బలవంతములు. ఇది ప్రశ్నయందుపయోగించును.

రాశిబలము చెప్పి రాశిప్రమాణములు చెప్పుచున్నాడు. "పూర్వార్ధే విషయాదయ" ఇతి. మకర-కుంభ-మీన-మేష-వృషభ-మిధునములు-పూర్వార్ధము కర్కటాది ధనురాశివరకు-అపరార్ధం.

ఈ 12 రాశులు సగటున 2గం॥ చొప్పున ఒకరోజులో 24గం॥ ఆవృత్తి అగుచున్నది. స్థలభేదముననుసరించి లగ్నప్రమాణ కాలములు మారును. లంకోదయ కాలము నాధారము చేసుకొని వరాహమిహిరులు లగ్నకాలము గుణించిరి. ప్రశ్నశాస్త్రమునందు దీర్ఘకాల-హ్రస్వకాల లగ్నప్రమాణము వినియోగమగును.





3వ రాశికి దుశ్చిక్యమని- 9వ రాశికి తపమని పేర్లుకలవు. 3వ రాశిని పేర్కొనుట వలన మూడవ స్థానప్రమాణము తొమ్మిదవరాశికి లంకోదయ ప్రమాణకాలమని సూచింపబడినది. 9వ స్థానమునకు విశేషప్రాధాన్యత కలదు.

"సర్వంవిహాయచింత్యం భాగ్యర్క్షం ప్రాణినాం విశేషేణ" అని చెప్పబడినది. అనగా సర్వము విడిచినను భాగ్యస్థానము 9 విశేషముగా పరీక్షించవలయును.

**20. శ్లో॥ రక్తఃశ్వేతః శుకతనునిభః పాటలో ధూమ్రపాండుః**
**చిత్రః కృష్ణః కనక సదృశః పింగళః కర్బురశ్చ ।**
**బభ్రుః స్వచ్ఛః ప్రథమభవనాద్యేషు వర్ణాః ప్లవత్వం**
**స్వేశాశాఖ్యం దినకరయుతాత్ భాత్ ద్వితీయంచవేసి ॥**

## దశాధ్యాయి :

మేషాదిరాశి వర్ణములు తెలుపుచున్నాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | - | ఎరుపు | తుల | - | నీలం |
| వృషభము | - | తెలుపు | వృశ్చికం | - | బంగారం |
| మిధునము | - | ఆకుపచ్చ | ధనుస్సు | - | కపిలం |
| కర్కాటకము | - | లేతగులాబి | మకరం | - | కపిలతెలుపు |
| సింహం | - | పొగతెలుపు | కుంభం | - | కపిలతెలుపు |
| కన్య | - | మిశ్రవర్ణం | మీనం | - | చేపరంగు. |

మేష-వృశ్చికములకు కుజుడధిపతి. కుజుడు దక్షిణదిశాధిపతి. కనుక మేష-వృశ్చికములు దక్షిణదిక్కును సూచించును. దీనిని ప్లవసంకేతముందురు. ఇట్లే ఇతరరాశులకు తెలియవలెను. ఇవి చోరప్రశ్నయాత్రా విషయములందు పయోగించవలయును.

**వర్ణప్రయోజనము :**

**శ్లో॥ జన్మోదయ గృహేవర్ణాః తదధిపతేః పూజితాగృహే ప్రతిమా।**
**హంతి హరేరిహ శత్రూనింద్ర ధ్వజినీవ దేవరిపూన్॥**

ఆయా రాశులందు జన్మించినవారు ఆయా వర్ణములతో ఇష్టదేవతాప్రతిమ నారాధించిన శత్రుజయం కలుగును. వైభవము సిద్ధించును.

సూర్యుడున్నరాశికి 2వ రాశి వేసి, 12 వాసి అనబడును.

ఇతి గోవింద సోమయాజి కృతౌబృహజ్జాతక
వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం
ప్రథమాధ్యాయః ॥

★★★

## ద్వితీయాధ్యాయః

## గ్రహయోని భేదాధ్యాయః

**1. శ్లో॥ కాలాత్మా దినకృన్మనస్తుహినగుః సత్త్వం కుజోజ్ఞోవచో**
**జీవో జ్ఞానసుఖే సితశ్చమదనో దుఃఖం దినేశాత్మజః ।**
**రాజానౌరవిశీతగూ క్షితిసుతో నేతాకుమారో బుధః**
**సూరిర్దానవ పూజితశ్చ సచివౌ ప్రేష్యః సహస్రాంశుజః ॥**

**దశాధ్యాయి :**

మేషాది అవయవములతో ఉన్నకాలపురుషునకు సూర్యాదిగ్రహముల సంబంధము వివరించుచున్నాడు. కాలపురుషునకు ఆత్మ సూర్యుడు. మనస్సుచంద్రుడు. సత్త్వము కుజుడు. వాక్కు బుధుడు. జ్ఞానసుఖములు గురుడు. శృంగారము శుక్రుడు. దుఃఖము శని.





వీటిలో బలమైన గ్రహము జాతకునకు ఆయాఫలితములనిచ్చును.

ఆత్మభూతుడైన సూర్యుడు బలముగా నున్నచో జాతకుడు ఆత్మప్రభావము ఎక్కువగా పొందును. సర్వకార్య పౌరుషసిద్ధికి ఆత్మప్రభావమే కారణము. అందుచేత ముందుగా సూర్యగ్రహబలం పరిగణించాలి.

చంద్రబలమువల్ల మనోభీష్టసిద్ధి తెలియును. కనుక జాతకమందు సూర్య-చంద్రుల బలము బాగుండవలయును. అందుచేతనే-

**శ్లో॥ సవితా దశాఫలానాం పాచయితా**
**చంద్రమాః ప్రబోధయితా ।**
**ఆదిత్య చంద్రవశగాః**
**సర్వే తారాగ్రహాః జ్ఞేయాః ॥** అని చెప్పబడినది.

కుజుడు భూపుత్రుడు కనుక కుజునివలన స్థిరత్వము-స్థైర్యము తెలియవలెను. సుఖశబ్దముచేత ధనముకూడా గ్రహించవలయును. సుఖము ధనము వలనే కలుగును.

**శ్లో॥ గురుణాదేహపుష్టిఃస్యాత్ బుద్ధిపుత్రార్థ సంపదః॥**

సంగీత సాహిత్యాది జ్ఞానము శుక్రునివల్లను- వేదశాస్త్ర పురాణజ్ఞానము గురునివల్లను తెలియవలెను.

గురునివలన సత్త్వ గుణము సత్త్వ సుఖము- శుక్రునివలన రాజససుఖము గ్రహించవలయును.

'మదన' శబ్దముచేత సురభిద్రవ్య-హృద్య-అన్నపాన-అంబర-భార్యా-వివాహకర్మ-భోగస్థాన-వాహన-గీతకళాదులు తెలియవచ్చును.

దుఃఖము శనివలన తెలియును.

**శ్లో॥ సంపదే గురు సంయోగః శనియోగో విపత్తయే ।**
**చింతితవ్యంసదాపుంసాం సర్వభావానుసారతః ॥**

అంతేగాక-సూర్యాది గ్రహములు ఆదివారము-సోమవారము-ఇత్యాది క్రమముగా చెప్పబడినది. దీనివలన ఆరోజు ఆగ్రహప్రభావము హోరాదులవలన తెలియును.

మానవ జీవనక్రమము సూర్యాదిగ్రహములు ఇట్లు తెలియజెప్పుచున్నవి.

సూర్యునివలన పిండమందు ఆత్మప్రవేశము- చంద్రునివలన మనస్సు పుట్టుక- కుజునివలన నేనుఅను అహంబుద్ధి కలుగుట- బుధునివలన బాలునికి మాటలువచ్చుట- గురునివలన జ్ఞానము- శుక్రునివలన విషయసుఖములు- శనివలన వార్ధక్యమందు దుఃఖము- క్షీణత్వము కలుగుచున్నవి.

సూర్య-చంద్రులు క్షత్రియులు - కుజుడు సేనాధిపతి - బుధుడు యువరాజు - గురుశుక్రులు - మంత్రులు - శని సేవకుడు. జన్మకాలమందు బలవత్తర గ్రహము ననుసరించి తత్సమాన రూప- భావము లేర్పడును.

మరొకవిశేషము కలదు. ద్వాదశరాశ్యాత్మకమైన కాలచక్రమునకు సూర్య-చంద్రులు రాజులు. సూర్యుడు తన స్వక్షేత్రమయిన సింహమునుంచి వరుసగా 6రాశులకు అధిపతి. చంద్రుడు తన స్వస్థానమయిన కర్కాటకము నుంచి విలోమముగా 6రాశులకు అధిపతి. ఈ సూర్యచంద్రులే కుజాదిగ్రహములకు రాశ్యాధిపత్యం. భావకారకత్వం అనుగ్రహించారు. యువరాజు అయిన బుధునికి ధనాధిపత్యం (కన్య), పరాక్రమస్థానమైన తృతీయము ఆమాత్యుడైన శుక్రునకు (తుల). బంధుస్థానమైన చతుర్థము సేనాధిపతి అయిన కుజునకు (వృశ్చికం) బుద్ధిమంతుడైన గురునకు పంచమ బుద్ధిస్థానము (ధనుస్సు) - సేవాకారకుడైన శనికి సేవాస్థానము 6 (మకరము) ఇవ్వబడ్డాయి.

ఇవి చంద్రుని నుంచికూడా విలోమముగా ఇదేవిధముగా క్రమములో సరిపోవును.





**2. శ్లో॥ హేళిః సూర్యః చంద్రమా శీతరశ్మిః**
**హేమావిత్ జ్ఞో బోధనశ్చేందు పుత్రః ।**
**ఆరో వక్రః క్రూరదృక్ చావనేయో**
**కోణోమందః సూర్యపుత్రోఽసితశ్చ ॥**

**3. శ్లో॥ జీవోఽంగిరాః సురగురుర్వచసాంపతీజ్యః**
**శుక్రోభృగుర్భృగుసుతః సిత ఆస్ఫు జిచ్చ ।**
**రాహుస్తమో ఽగురుసురశ్చ శిఖీతికేతుః**
**పర్యాయమన్య దపలభ్యవదేచ్చలోకాత్ ॥**

## దశాధ్యాయి :

గ్రహములకు నామాంతరములు చెప్పుచున్నారు. హేళిః-సూర్యః అనునది భానునకు, చంద్రమాః-శీతరశ్మిః అనునది చంద్రునకు, హేమ-విట్-జ్ఞః -బోధనః-ఇందుపుత్రః అనునవి బుధునకు, ఆరః-వక్రః-క్రూరదృక్-ఆవనేయః -అనునవి కుజునకు, కోణః-మందః-సూర్యపుత్రః-అసితః అనునవి శనికి జీవః-అంగిరః-సురగురుః-వాచస్పతి-ఇజ్య అనునవి గురునకు, భృగు-భృగుసుత-సిత-ఆస్ఫుజిత- అనునవి శుక్రునకు, తమః-అగు-అసుర అనునవి రాహువునకు, శిఖి అనునది కేతువుకు నామాంతరములు.

ఇందు సూర్యచంద్రులు ప్రకాశగ్రహములు, కుజ-బుధ-గురు-శుక్ర-శనులు పంచతారాగ్రహములు-రాహుకేతువులు తమోగ్రహములు.

జాతకవిషయమందు సర్వత్రముందుగా సూర్యచంద్రులను పరీక్షించాలి. బుధుడు కూడా ఆశ్రయవశముచేత సుఖదుఃఖ ప్రదాతఅగుచున్నాడు. తరువాత కుజశనులు అనిష్టఫలదాతలు-గురుశుక్రులు ఇరువురూ శుభప్రదాతలు. రాహుకేతువులకు స్వక్షేత్రములు లేనందున అశుభదాయకులు.

ఇచ్చట చెప్పని విషయములు లోకమునందును-శాస్త్రమునందును గ్రహించి చక్కగా ఫలనిరూపణ చేయవలయును.

గ్రహ వర్ణములు చెప్పబడుచున్నవి. సూర్యుడు రక్తశ్యామల వర్ణము– చంద్రుడు తెలుపు – కుజుడు పొట్టివాడు ఎరుపు కలసిన తెలుపు. బుధుడు ఆకుపచ్చ – గురుడు పసుపు – శుక్రుడు తెలుపు – శని నీలం – దీని శ్లోకం.

**4. శ్లో॥ రక్తశ్యామో భాస్కరో గౌర ఇందుః**
**నాత్యుచ్చాంగో రక్త గౌరశ్చవక్రః ।**
**దూర్వాశ్యామో జ్ఞో గురు ర్గౌరగాత్రః**
**శ్యామఃశుక్రో భాస్కరిః కృష్ణదేహః ॥**

జననసమయమందు బలవంతుడైన గ్రహసంబంధ వర్ణము జాతకునకు కలుగును.

అదేవిధముగా ప్రశ్నయందును ప్రయోజనము కలుగును.

**కృష్ణీయమందు :**

**శ్లో॥ ఆత్మాకృతి కర్ణాదీన్ గ్రహస్తునజహాతి**
**పరగృహస్థోఽపి। తత్సామ్యా**
**కృతివర్ణో వ్రజతీత్యపరే వ్యవస్యంతి ॥**

**5. శ్లో॥ వర్ణాస్తామ్రసితాతి రక్తహరితవ్యాపీత చిత్రాసితా**
**వహ్న్యంబ్వగ్నిజ కేశవేంద్ర శచికాః సూర్యాదినాథాః క్రమాత్।**
**ప్రాగాద్యాః రవిశుక్రలోహిత తమ స్సౌరేందు విత్సూరయః**
**క్షీణేంద్వర్క మహీసుతార్క తనయాః పాపాః బుధస్తైర్యుతాః ॥**

**దశాధ్యాయి :**

వర్ణములకు అధి పతిగ్రహములను చెప్పుచున్నాడు. ఎరుపునకు రవి – తెలుపునకు కుజుడు, అకుపచ్చకు బుధుడు, వివిధ వర్ణములకు శుక్రుడు –





నీలమునకు శని అధిపతులగుచున్నారు. ప్రశ్నయందు ఈ విషయము పయోగించును.

సూర్యాదిగ్రహములకు అధిదేవతలు – సూర్యునకు అగ్ని – చంద్రునకు గౌరి – కుజునకు కుమారస్వామి – బుధునకు విష్ణువు – గురునకు ఇంద్రుడు – శుక్రునకు శచీదేవి – శనికి బ్రహ్మ.

తూర్పునకు సూర్యుడు – ఆగ్నేయమునకు శుక్రుడు – దక్షిణమునకు కుజుడు – నైరుతికి రాహువు – పడమరకు శని – వాయవ్యమునకు చంద్రుడు – ఉత్తరమునకు బుధుడు – ఈశాన్యమునకు గురుడు అధిపతులు. ఇవి జాతకమందు వర్తించును.

"క్షీణేంద్వర్క"– అని చెప్పుటవలన క్షీణచంద్రుడు పాపి, ఇతనికంటే సూర్యుడు – కుజుడు శని ఉత్తరోత్తరాపాపులు. వీరితోకలసిన బుధుడు పాపి.

సూర్యునకు సత్త్వగుణము కనుక అత్యంత పాపికాదు. కుజుడు తమోమయుడు. శని తమోమయుడు – వాయుభూతము – దుఃఖకారకుడు కనుక అత్యంతపాపి.

యవనమతరీత్యా రవి క్రూరుడు – కుజశనులు పాపులు. వారి మాటల్లో

**శ్లో॥ క్రూరగ్రహోర్కః కుజసూర్యజౌతు**
**పాపౌ,శుభాః శుక్ర శశాంక జీవాః ॥**

**6. శ్లో॥ బుధ సూర్యసుతేనపుసంకాఖ్యౌ**
**శశిశుక్రౌ యువతీనరాస్తు శేషాః ।**
**శిఖిభూఖపయోమరుద్గణానాం**
**వశినోభూమిసుతాదయః క్రమేణ ॥**

## దశాధ్యాయి :

గ్రహములలో శనిబుధులు నపుసంక గ్రహములు – చంద్రశుక్రులు స్త్రీ గ్రహములు – రవి కుజగురులు పురుష గ్రహములు.

పంచభూత తత్త్వములలో, సూర్యుడు కుజుడు అగ్నితత్త్వము – చంద్ర శుక్రులు జలతత్త్వము – బుధుడు భూతత్త్వము – గురుడు ఆకాశతత్త్వము – శని వాయుతత్త్వము.

శ్లోకములో 'గణ' శబ్దము పాదపూరణార్ధమని ఒకరిచే వ్యాఖ్యానించ బడినది. అదియుక్తముకాదు. వరాహమిహిరులు వ్యర్థపదములు ప్రయోగించ లేదు. "అర్థబహుళం స్వల్పం శాస్త్రప్లవం ప్రారభే" అని ప్రతిజ్ఞ చేశారు. గణశబ్దము ప్రతీతత్త్వమునకు చేర్చవలెను. అపుడు శిఖిగణం వహ్నిరూపం – అనగా చక్షురింద్రియపాద, వ్యానమనోమయకోశములు అవగతమగును. భూగణములో పృథివీగంధ ఘ్రాణేంద్రియ ఉపస్థప్రాణ అన్నమయ కోశములు వ్యక్తమగును.

ఆకాశగణములో ఆకాశశబ్ద శ్రోత్రేంద్రియ వాక్ సమానానందమయ కోశములు–

పయోగణములో జలరసనేంద్రియ పాయ్వపానప్రాణమయకోశములు–

మరుద్గణములో వాయు స్పర్శత్వగింద్రియ పాణ్యుదాన విజ్ఞానమయ కోశములు తెలియబడుచున్నవి.

భూ–జలప్రశ్న–వర్షప్రశ్నలందు వీటి వినియోగముండును.

## సంపత్కరీవ్యాఖ్య :

యోగసాధకుల సాధనా సిద్ధి విషయములోను, ఆరోగ్య విషయనిర్ధారణ యందును కూడా గణము సహాయపడును. వేదాంత విషయకముగా "పంచీకరణ" మందు ఇది నిరూపించదగును. అనగా అన్వయము కుదురును.





భగవత్పాదాచార్యులు (జయమంగళ వ్యాఖ్యలో)

**శ్లో॥ పటుయోరుభయోశ్చ దండసంస్థా**
**పృథివీతోయమధః కృశానురూర్ధ్వం ।**
**పవనస్త్వథ పార్శ్వగోతి మధ్యే**
**గగనం భూతగతి స్తనూద్భవేయం ।**

ప్రశ్నవిషయమందు

**శ్లో॥ నమృతిర్నరోగశాంతిర్ధరణీరుదయే జలోదయేతుపునః ।**
**ఈప్సితమచితాత్ సిధ్యతి వహ్నేరుదీయే మృతిర్విరోధశ్చ ।**
**వాయోరుదయే సర్వం సిధ్యతి గమనాగమాది చలకార్యం ।**
**వ్యాధ్యారంభో నాశో ద్రవ్యాణా మాహవశ్చాత్ర ।**
**ఆకాశోదయకాలే సిధ్యత్యశుభం విశేషేణ ॥**

**7. శ్లో॥ విప్రాదితః శుక్రగురూ కుజార్కౌ**
**శశీబుధ శ్చేత్యసితోఽ౦త్యజానాం ।**
**చంద్రార్క జీవా జ్ఞసితే కుజార్కీ**
**యధాక్రమం సత్త్వరజస్తమాంసి ॥**

## దశాధ్యాయి :

గురుశుక్రులు బ్రాహ్మణులు సూర్యకుజులు క్షత్రియులు – చంద్రుడు వైశ్యుడు – బుధుడు శుద్రుడు, శని చండాలుడు.

రవి చంద్రగురులు సత్త్వగుణ సంపన్నులు – బుధశుక్రులు రజోగుణ సంపన్నులు – శని కుజులు తమోగుణ ప్రధానులగుచున్నారు.

సంగ్రామవిజయమను గ్రంథమందు–

శ్లో॥ సౌమ్యౌ భృగ్వంగిరసౌ దండాధీశౌ దివాకరోర్వీజౌ ।
దానాధిపః శశాంకో భేదస్యబుధార్కపుత్రీచ ॥

సత్వాదిగుణముననుసరించి స్వభావములు ఎట్లుండునో బృహత్సంహిత యందిట్లు చెప్పబడినది.

శ్లో॥ యస్సాత్వికః తస్యభవేత్ స్థిరత్వం సత్యార్జవే బ్రాహ్మణదేవభక్తిః
రజోధికః కావ్యకళాక్రతుస్త్రీ సంసక్తచిత్తః పురుషోతి శూరః ।
తమోధికోవంచయితాపరేషాంహింస్రోఽలసఃక్రోధపరోఽతినిద్రః
మిశ్రైః గుణైః మిశ్రగుణస్వభావాః భవంతి సర్వేపి శరీరభాజః ॥

స్వల్పజాతకమందు-

శ్లో॥ సత్త్వం రజస్తమోవాత్రింశాంశేయస్య భాస్కరస్తాదృక్ ।
బలినః సదృశీమూర్తిః బుధ్వా వా జాతికుల దేశాన్ ॥

లగ్నమందు గ్రహదృష్టి యోగముల చేత లగ్నాధిపతులచేత - బలవద్గ్రహము యొక్క త్రిగుణాధిపత్యము పరిశీలించవలయును.

ఇష్టదేవతా విషయమందు గ్రహముల స్త్రీ-పుం విచారణ చేసి, గుణత్రయాను సారముగా ఫలనిరూపణ చేయవలయును.

8. శ్లో॥ మధుపింగళదృక్ చతురశ్రతనుః
పిత్తప్రకృతిః సవితాల్ప కచః ।
తనువృత్తతను ర్బహువాత కఫః
ప్రాజ్ఞశ్చశశీ మృదువాక్ శుభదృక్ ॥

**దశాధ్యాయి :**

గ్రహముల స్వరూప స్వభావములు చెప్పుచున్నాడు. సూర్యుడు తేనెరంగు కన్నులవాడు - సమశరీరుడు - పైత్యప్రకృతి - స్వల్పకేశములు కలవాడు.





చంద్రుడు గుండ్రని ఆకారము కలవాడు వాతశ్లేష్మ స్వభావము - ప్రాజ్ఞుడు - మృదువుగా సంభాషించువాడు చూడచక్కనివాడు.

9. శ్లో॥ క్రూరదృక్ తరుణమూర్తిరుదారః
పైత్తికః సుచపలః కృశమధ్యః ।
శ్లిష్టవాక్ సతత హాస్యరుచిజ్ఞః
పిత్తమారుత కఫ ప్రకృతిశ్చ ॥

**దశాధ్యాయి :**

కుజుడు క్రూరదృష్టి కలవాడు - యవ్వనుడు, పైత్యప్రకృతి - అస్థిరచిత్తుడు - సన్నని నడుము కలవాడు.

బుధుడు గద్గదముగా మాట్లాడువాడు - హాస్యసంభాషణాచతురుడు - పిత్త-వాయు-కఫ ప్రకృతిగలవాడు.

10. శ్లో॥ బృహత్తనుః పింగళ మూర్ధజేక్షణో
బృహస్పతిః శ్రేష్ఠమతిః కఫాత్మకః ।
భృగుస్సుఖీ కాంతవపుః సులోచనః
కఫానిలాత్మాఽసితవక్ర మూర్ధజః ॥

**దశాధ్యాయి :**

గురుడు స్థూలశరీరమువాడు - బంగారు రంగు కేశములవాడు - పింగళనేత్రుడు - ధీశాలి - శ్లేష్మాత్మక ప్రకృతి కలవాడు.

శుక్రుడు నిత్యమూ సుఖాభిలాషీ - అందమైనవాడు - మనోజ్ఞములైన కళ్లుకలవాడు - శ్లేష్మవాత ప్రకృతి కలవాడు - నల్లని ఉంగరాల జుట్టువాడు.

11. శ్లో॥ మందోలసః కపిలదృక్ కృశదీర్ఘగాత్రః
స్థూలద్విజః పరుషరోమకచోఽనిలాత్మా ।

స్నాయ్వస్థి అసృక్త్వగథశుక్లవసేచమజ్జా
మంద్రార్క చంద్ర బుధ శుక్ర సురేడ్యభౌమాః ॥

**దశాధ్యాయి :**

శని బద్ధకస్తుడు – కపిలవర్ణ నేత్రుడు – చిక్కిన పొడుగైన దేహమువాడు – పెద్దపెద్ద పళ్లుగలవాడు – బిరుసు వెంట్రుకలవాడు. వాత ప్రకృతికలవాడు.

గ్రహములకు శరీరమందలి ఆధిపత్యధాతువులు – శనికి నరములు – సూర్యునకు ఎముకలు – చంద్రునకు రక్తము – బుధునకు చర్మము – శుక్రునకు రేతస్సు – గురునకు మెదడు – కుజునకు ఎముకలలోని మూలుగు.

రోగాది విషయములలో దీనిని అనుసరించి ఫలిత నిర్ణయము చేయవలయును.

12. శ్లో॥ దేవాంబ్వగ్ని విహారకోశశయన క్షిత్యుత్కరాః స్యుః క్రమాత్
వస్త్రం స్థూలమభుక్తమగ్నికహతం మధ్యందృఢం పాటితం।
తామ్రంస్యాన్మణి హేమశుక్తి రజతాన్యర్కాత్తుముక్తాయసీ
ద్రేక్కాణైః శిశిరాదయః శశురచజ్ఞగ్వాది షూద్యత్సువా ॥

**దశధ్యాయి :**

గ్రహముల స్థానములు చెప్పుచున్నాడు. సూర్యుడు–పూజాగృహములు, చంద్రుడు–స్నానశాలలు, కుజుడు–వంటశాల, బుధుడు–ఆటలమైదానము, గురుడు–టంకశాల, కోశాగారము, శుక్రుడు–పడకగది, శని–ధూళిప్రదేశములు.

గ్రహవస్త్రములు, సూర్యుడు–ముతకబట్ట, చంద్రుడు–కొత్తబట్ట, కుజుడు–కాలినది, బుధుడు–తడిసినది, గురుడు–వాడినది, శుక్రుడు–గట్టిది, శని–చిరిగినది.





గ్రహలోహములు, సూర్యునకు–రాగి, చంద్రునకు–మణులు, కుజునకు–బంగారము, బుధునికి–ఇత్తడి,కంచు, గురుడు–వెండి, శుక్రుడు–ముత్యములు, శనికి–ఇనుము,సీసము.

గ్రహ ఋతువులు, శని–శిశిరము, శుక్రుడు–వసంతము, కుజుడు–గ్రీష్మం చంద్రుడు–వర్షం, బుధుడు–శరత్, గురుడు–హేమంతము.

లగ్నమునగ్రహములేకున్న, లగ్న ద్రేక్కాణము ననుసరించి ఋతునిర్ణయము చేయవలయును.

13. శ్లో॥ త్రిదశత్రికోణ చతురశ్రసప్తమాని
అవలోకయంతి చరణాభివృద్ధితః ।
రవిజామరేడ్యరుధిరాః పరేచయే
క్రమశోభవంతి కిల వీక్షణేఽధికాః ॥

**దశాధ్యాయి :**

గ్రహదృష్టులను చెప్పుచున్నాడు. గ్రహములు తామున్న రాశినుంచి 3–10 స్థానములను పాదదృష్టిచేతను, 5–9 స్థానములను అర్ధదృష్టి చేతను, 4–8 స్థానములను త్రిపాద దృష్టితోను సప్తస్థానమును పూర్ణదృష్టితోను చూస్తారు.

విశేషదృష్టులు, శని 3–10, గురుడు 5–9, కుజుడు 4–8, సూర్య–చంద్ర–బుధ–గురు–శని–కుజ–శుక్రులు–7, సంపూర్ణముగా చూచెదరు.

యవనులు మతరీత్యా 1–11–12 గ్రహదృష్టులను శ్రీపతి అంగీకరించ లేదు. దృష్టిగణన శ్రీధరపద్ధతి (శ్రీపతిపద్ధతి) యందు విశేషముగా వివరించ బడినది.

ముహూర్తవిషయము నందు విశేషదృష్టి వర్తించదు. కేవలం సప్తమదృష్టినే గ్రహించవలయును.

**కృష్ణీయమందు :**

**శ్లో॥ చతురేక వింశషోడశ నవసంఖ్యా పంచసప్త దశకిరణాః ।**
**మందగతి చంద్రభార్గవ శశిసుతరవిభౌమ జీవానామ్ ॥**

ఇందు గ్రహదృష్టులకు రశ్మిసంఖ్య చెప్పబడినది. శని-4, చంద్ర-21, శుక్ర-16, బుధ-9, సూర్యుడు-5, కుజ-7, గురుడు-10.

ఇవి మిత్రగృహమందు పాదసంఖ్య - స్వగృహమందు త్రిపాదసంఖ్య - ఉచ్ఛయందు సంపూర్ణసంఖ్య - త్రికోణములందు అర్ధసంఖ్య పొందును. నీచయందు నిష్ఫలం - శతృక్షేత్రమందు అల్పఫలం కలుగును.

"దృష్ట్యాసమానం ప్రవదేచ్ఛసంఖ్యా" సంతాన - కళత్ర విషయములందు దృష్టిసంఖ్య ననుసరించి అంతమంది కలుగుదురు.

'చరణాభివృద్ధితః' అని చెప్పుటచేత విశేషమేమనగా కాలహోరాధిపత్య ప్రమాణముకూడా నిరూపించబడినది.

దినమునందు ఆదినాధిపతిహోరతో ఈ క్రమములో నుండును. సూర్య-శుక్ర -బుధ-చంద్ర-శని-గురు-కుజహోరలు క్రమముగా ఏర్పడును. హోరాకాల ప్రమాణము 21/2 ఘడియలు, అనగా ఒకగంట ఉండును. సూర్యోదయాది గ్రహించవలయును.

**ఆర్యభటుడు :**

**శ్లో॥ భానామధః శనైశ్చరః సురగురుభౌమార్కాః శుక్రబుధ చంద్రాః ।**
**తేషామధశ్చ భూమిర్మేధీ భూతా ఖమధ్యస్థా ॥**

రవిజామరేద్యరుధిరాః అని క్రమము కూడా సూచింపబడినది.

**11. శ్లో॥ అయనక్షణవాసరర్తవో**
**మాసోర్ధంచ సమాచ భాస్కరాత్ ।**





**కటుకలవణతిక్త మిశ్రితా**
**మధురావమ్లౌచ కషాయ ఇత్యపి ॥**

**దశాధ్యాయి :**

గ్రహముల కాలప్రమాణము చెప్పుచున్నాడు. ఇది ప్రశ్నయందు పయోగించును.

సూర్యునకు 6నెలలు - చంద్రునకు క్షణము - కుజునకు 1రోజు - బుధునకు 2నెలలు - గురువునకు 1నెల - శుక్రునకు 15రోజులు - శనికి 1సం॥రము.

ప్రశ్నలగ్నము ఏగ్రహనవాంశయగునో ఆ గ్రహమునకు నిర్ణయించిన కాలము ఫలితవిషయములో ఉపయోగపడును.

**కృష్ణీయమందు :**

**శ్లో॥ క్షణదివసపక్షమాసర్త్యయనాబ్దానాం నవాంశ కైర్వాచ్యం।**
**శశిభౌమ శుక్రగురు బుధ రవిసౌరేః క్రమాద్భుక్తైః॥**

గ్రహములకు రుచులు - సూర్యునకు కారము - చంద్రుడు ఉప్పు - కుజుడు చేదు - బుధుడు షడ్రసమిశ్రితము - గురుడు తీపి - శుక్రుడు పులుపు - శని వగరు.

**15. శ్లో॥ జీవోజీవబుధౌ సితేందుతనయౌ**
**వ్యర్కాః విభూజాః క్రమాత్ ।**
**ఇంద్వర్కా వికుజేంద్వినాశ్చ**
**సుహృదః కేషాంచిదేవంమతమ్ ॥**
**సత్యోక్తేసుహృదస్త్రికోణభవనాత్**
**స్వాత్ స్వాంత్యధీ ధర్మపాః**

**స్వోచ్చాయుస్సుఖపాశ్చ లక్షణవిధేః**
**నాన్యైర్విరోధాదితి ॥**

**దశాధ్యాయి :**

గ్రహములకు మిత్ర శతృత్వములు, యవన – సత్యాచార్య భేదములు చెప్పుచున్నారు. వరాహ మిహిరులు సత్యాచార్య మతమునే అంగీకరించిరి.

యవన మతరీత్యా సూర్యునకు గురుడు మిత్రుడు.

| | | |
|---|---|---|
| చంద్రుడు | – | శుక్రబుధులు మిత్రులు |
| బుధునకు | – | చంద్ర–కుజ–గురు–శుక్ర–శనులు |
| గురునకు | – | రవి–చంద్ర–బుధ–శుక్ర–శనులు |
| శుక్రునకు | – | కుజ–బుధ–గురు–శనులు |
| శనికి | – | బుధ–గురు–శుక్రులు మిత్రులు. |

మిగిలిన గ్రహములు వారికి శత్రువులు.

సత్యాచార్య రీత్యా గ్రహముయొక్క మూల త్రికోణరాశికి 2–4–5–8–9–12 అధిపతులు మిత్రులు. స్వోచ్చాధిపతి మిత్రుడే. ఇతరరాశ్యాధి పతులు శతృవులు. ఒకే ఆధిపత్యం వచ్చిన గ్రహంసముడు. ఏకరాశ్యాధిపతులకు ఇది వర్తించదు.

ఉదాహరణ–సూర్యునకు మూలత్రికోణము సింహము. ఈరాశినుంచి 2–4–5–8–9–12 అధిపతులు మిత్రులు. బుధుడు తన 2రాశులలో కేవలం 2వ ఆధిపత్యం ఒకటే వచ్చినది. 11వ ఆధిపత్యం చెప్పబడలేదు కనుక సముడు.

**16. శ్లో॥ శత్రూమందసితౌ సమశ్శశిసుతౌ మిత్రాణిశేషారవేః**
**తీక్ష్ణాంశుర్హిమరశ్మిజశ్చ సుహృదౌ శేషాస్సమాశ్శీతగోః ।**





**జీవేందూష్ణకరాః కుజస్యసుహృదో జ్ఞోఽరిస్సితార్కీసమౌ**
**మిత్రేసూర్యసితౌ బుధస్యహిమగు శ్శత్రుస్సమాశ్చాపరే ॥**

**దశాధ్యాయి :**

సూర్యునకు – చంద్ర కుజ గురులు మిత్రులు, బుధుడు సముడు, శనిశుక్రులు శత్రువులు. చంద్రునకు – రవిబుధులు మిత్రులు, కుజగురు శుక్రశనులు సములు. చంద్రునకు శత్రువులేడు. కుజునకు – సూర్యచంద్ర గురులు మిత్రులు. బుధుడు శత్రువు – శుక్రశనులు సములు. బుధునకు – సూర్య శుక్రులు మిత్రులు, కుజగురు శనులు సములు, చంద్రుడు శత్రువు.

**17. శ్లో॥ సూరేః సౌమ్యసితావరీరవిసుతో మధ్యః పరేత్వన్యధా।**
**సౌమ్యార్కీ సుహృదౌ సమౌకుజగురూ శుక్రస్య శేషావరీ।**
**శుక్రజ్ఞౌ సుహృదౌ సమస్సురుగురుః సౌరస్యఽచాన్యేఽరయో।**
**యేప్రోక్తాస్సుహృదస్త్రికోణభవనాత్తే మీమయా కీర్తితాః॥**

**దశాధ్యాయి :**

| | | |
|---|---|---|
| గురువునకు | – | సూర్యచంద్రకుజులు, మిత్రులు బుధశుక్రులు శత్రువులు, శని సముడు |
| శుక్రునకు | – | బుధశనులు మిత్రులు, సూర్యచంద్రులు శత్రువులు, కుజ గురులు సములు |
| శనికి | – | బుధ శుక్రులు మిత్రులు, సూర్యచంద్రకుజులు శత్రువులు–గురుడు సముడు. |

**సంపత్కుమారీవ్యాఖ్య :**

గ్రహములకు వారి మూలత్రికోణరాశుల నుండి శత్రుమిత్రత్వములను 15వ శ్లోకములో చెప్పినదీ, మరల విపులముగా 16–17 శ్లోకములలో చెప్పబడినది.

18. శ్లో॥ అన్యోన్యస్యధనవ్యయాయ సహజవ్యాపార బంధుస్థితాః
తత్కాలేసుహృదః స్వతుంగభవనే ప్యేకేఽ రయస్త్వన్యథా ।
ద్వ్యేకానుక్తభపాన్ సుహృద్సమరిపూన్ సంచింత్య నైసర్గికాన్
తత్కాలేన పునస్తు తానతిసుహృన్మిత్రాదిభిః కల్పయేత్ ॥

**దశాధ్యాయి :**

గ్రహములకు తాత్కాలిక మిత్రశత్రు సమత్వములు చెప్పుచున్నారు.

గ్రహములకు 2-3-4-10-11-12 స్థానములందున్న గ్రహములు తాత్కాలిక మిత్రులు. 1-5-6-7-8-9 స్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు.

ఇది జన్మకాల-యాత్ర-వివాహము-లందు నిరూపించదగును.

లగ్నాధిపతినుంచి తాత్కాలిక మిత్రస్థానములలో యేభావాధిపతి ఉండునో ఆ భావమువృద్ధి చెందును.

పిత్రాదికారకులైన సూర్యాదులు బలవంతులై, శుభదృష్టి కలవారై, లగ్నాధిపతి నుంచి తాత్కాలిక మిత్రస్థానములలో నున్నచో పిత్రాదులు అతి సుహృదులగుదురు.

ఆయా భావములనుంచి కూడా దీనిని పరిశీలించవచ్చును.

19. శ్లో॥ స్వోచ్చసుహృత్ స్వదృగాణ నవాంశైః
స్థానబలం స్వగృహోపగతైశ్చ ।
దిక్షు బుధాంగిరసౌ రవిభౌమౌ
సూర్యసుతః సిత శీత కరౌచ ॥

**దశాధ్యాయి :**

గ్రహముల బలములు చెప్పుచున్నాడు. గ్రహములకు 4 విధముల బలముండును. 1-దిగ్బలం 2-స్థానబలం 3-చేష్టాబలం 4-కాలబలం





1) గ్రహము ఉచ్చమిత్ర - స్వద్రేక్కాణ - స్వనవాంశ యందున్నచో స్థానబలము పొందును. చంద్రునకు పక్షబలము ప్రాధాన్యము. ప్రథమ ద్రేక్కాణమునందు స్త్రీ గ్రహమునకు, మధ్య ద్రేక్కాణమునందు నపుంసక గ్రహమునకు, అంత్య ద్రేక్కాణమునందు పురుషగ్రహమునకు బలాధిక్యము కలుగును.

ఉచ్చయందు అతిబలం - ఉచ్చ - త్రికోణ, స్వగృహ - అతిమిత్ర - మిత్ర - సమ - శతృ - అతిశతృ - నీచ అనిస్థానబలము 9 విధములు ఇవి క్రమముగా హీనమైనవి. నీచ నిష్ఫలం.

**శ్రీపతి పద్ధతియందు :**

శ్లో॥ స్వోచ్చేరూపం చరణరహితం స్వత్రికోణే
స్వభేఽర్థం। నాగాంశానాంత్రయమతి సుహృద్గే
హగే మిత్రభేఽఘ్రిః। అంశోష్టానాంసమ
గృహగతే భూపభాగోఽరిగేహే। దంతాం
శస్స్యా దతిరిపు గృహే నీచభే శూన్యమేవ।

2) దిగ్బలం - దిక్ శబ్దముచేత లగ్న - దశమ - సప్తమ - చతుర్థములు చెప్పబడును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| బుధగురులు | - | లగ్నమునయున్న | - | తూర్పు | - | బలము |
| రవికుజులు | - | దశమమున | - | దక్షిణం | - | బలము |
| శని | - | సప్తమమున | - | పశ్చిమం | - | బలం |
| చంద్రశుక్రులు | - | చతుర్థమున | - | ఉత్తరం | - | బలం |

20. శ్లో॥ ఉదగయనే రవిశీతమయూఖౌ
వక్రసమాగమగాః పరిశేషాః ।
విపులకరా యుధి చోత్తరసంస్థాః
చేష్టితవీర్యయుతా పరికల్ప్యాః ॥

**దశాధ్యాయి :**

3) చేష్టాబలము చెప్పబడుచున్నది. ఉత్తరాయణమున అనగా మకరాది ఆరురాశులందు రవిచంద్రులు బలవంతులు.

బుధ – గురు – శుక్ర – శనులు వక్రించిననూ చంద్రునితో కలసిననూ బలవంతులు.

కుజునితో కలసిన గ్రహము యుద్ధం. గ్రహయుద్ధమందు ఉత్తరదిశ యందున్న గ్రహము బలవత్తరము. శుక్రుడు మాత్రము దక్షిణదిశయందునూ జయము కలవాడగును.

**21. శ్లో॥ నిశి శశి కుజ సౌరాః**
**సర్వదా జ్ఞోఽహ్ని చాన్యే। బహుళసిత**
**గతాస్స్యుః క్రూరసౌమ్యాః క్రమేణ ।**
**స్వదివససమహోరా మాసపైః కాలవీర్యం**
**శకుబుగుశుచరాద్యాః వృద్ధితో వీర్యవంతః ॥**

**దశాధ్యాయి :**

4) కాలబలము చెప్పబడుచున్నది. చంద్రకుజశనులు రాత్రికాలమందు బలవంతులు రవిగురుశుక్రులు – పగటియందు బలవంతులు బుధుడు సర్వకాలమందు బలవంతుడు క్రూర గ్రహములు బహుళపక్షమున, శుభ గ్రహములు శుక్లపక్షమున బలవంతులు.

వారాధిపతి – సంవత్సరాధిపతి – స్వహోరాధిపతి – మాసాధిపతులు ఆయా కాలమందు బలవంతులు.

శని – కుజ – బుధ – గురు – శుక్ర – చంద్ర – సూర్యులు ఉత్తరోత్తరముగా బలవంతులు. ఇవి నైసర్గిక బలములు.





శాస్త్రాంతరమందు గణితప్రక్రియ చేత గ్రహబలములు నిర్ణయించుట చెప్పబడినది.

గర్భాధాన – జన్మకాల – చిత్ ప్రవేశకాలములు లగ్నబలము ననుసరించి నిర్ణయించవలెనని చెప్పబడినది.

ఆత్మప్రవేశకాలము మాత్రము ఆధాన జన్మకాలముల లగ్నముననుసరించి తెలుసుకొనవలయును.

**యవనేశ్వరులు :**

**శ్లో॥ మాసైఃషడ్భిః సమేధిత్వాత్ కాలాత్మామాసిసప్తమే**
**విత్తస్యాయవ్యయం పుత్రకళత్రాది మృతింతథా ।**
**వ్యాధి కర్మాణి విద్యాంచ చిదా సహనిషించతి**
**ప్రారబ్ధ కర్మవశతశ్శరీరే గర్భ సంస్థితే ।**
**ఏత మాలంబ్య మాతాచపితా భ్రాతా సఖాపరః**
**జయఃపరాజయోభాగ్యమేవమాద్యా భవంతిహి ॥**

వరాహమిహిరులు చతుష్ప్రకారబలములే చెప్పారు. కొందరు 6 విధములు చెప్పారు.

నూతన సం॥ర ప్రారంభదినమున ఏవారమగునో ఆవారాధిపతి, ఆ సం॥రాధిపతి అగును. మాసము యొక్క పాడ్యమి ఏవారమగునో ఆ వారాధిపతి ఆ మాసాధిపతి అగును.

**హరిదత్తుడిట్ల భిప్రాయపడినాడు :**

**శ్లో॥ త్రయోదశ దినేనోనం కలియాతదినంభజేత్**
**త్రింశతాఖాడ్గరామైశ్చ ద్విత్రిఘ్న సప్తభాజితం ।**
**మాసహోవర్షపశ్చైవ క్రమమేవంప్రకీర్తితమ్ ॥**

ప్రతిదినము చూచు కాలహోర 2విధములుగానున్నది.

1) 2.30ఘడియలు కాలము ఒకపద్ధతి. 2) 20విఘడియల కాలము ఒక హోరగా ఒకపద్ధతి. ఇది మరల రెండు విధములు. ఏవారమునకు హోరలు చూచెదవెూ ఆవారాధిపతి నుండి చక్రక్రమముగా - అనగా, శ-గు-కు-ఆ-శు-బు-చం వరుసలో హోరలు చూచుట.

మరియొక పద్ధతి ఏమనగా ఏవారమునకు హోరలు చూచెదమో ఆవారాధిపతి నుండి పంచమాధిపతి ప్రథమహోరగా లెక్కించవలయును.

ప్రశ్నయందు వారేశపంచమాధిపతి నుండి హోరలెక్కించవలయును. 20విఘడియల కాలహోరను గూర్చి -

**గర్గుడు :**

**శ్లో॥ కాలహోరాధి పాశ్చక్రక్రమాద్వారాధిపాత్ స్మృతాః**
**వినాడికా నఖమితా మానమేతస్య కీర్తితమ్ ॥**

గ్రహముల అయన బలము వరాహమిహిరులు ఇందు చెప్పలేదు. సూర్యసిద్ధాంతమందు చెప్పియున్నారు. సాయన పద్ధతిలో అయనాంశలు గ్రహముల భాగలకు కలియును.

**మణిత్థుడు :**

**శ్లో॥ అత ఊర్ధ్వం చలంత్యేవ సమమండలతో గ్రహాః।**
**సప్తవింశతి భాగాశ్చ ఖఖాష్టేంద్వమబ్దసంఖ్యయా॥**

**బృహత్సంహితయందు వరాహమిహిరులు :**

**శ్లో॥ ఆశ్లేషార్ధాద్దక్షిణ ముత్తరమయనంరవేః**
**ధనిష్ఠాద్యమ్॥**





**హరిదత్తుడు :**

**శ్లో॥ చతుర్వింశతిభాగాస్స్యుః చలంత్యేవగ్రహాస్తతః ।**

సూర్యసిద్ధాంత కారుల రీత్యా 108 వేల సం॥లకు 27 భాగలు కిందకు గ్రహముల చలనముండును. ఈ సిద్ధాంతరీత్యా సంవత్సరమునకు 0.54” లిప్తలు “అయనాంశ” చలనముండును.

గ్రహములకు 8 విధముల గమనము కలదు. అపమండలమందు తూర్పు దిశగా వెళ్లు గ్రహము ఎక్కడో ఒకచోట రాశియందు నిలచి ఒక కళమాత్రం వెనుకకు వెళ్లుటకు ఆరంభించునో, అచట నుండి 5రోజులు దాటి వక్రగతి యనబడును. ఆ 5రోజులు దానిముందు 5రోజులు మొత్తం 10రోజులు. కుజ-బుధ-శుక్రుల అను వక్రగతి యనబడును. గురు-శనులకు 20రోజులు అనువక్రగతియుండును. మరల తూర్పుదిశగా కదలు గ్రహము తామున్నచోటున ఎంతకాలము చేరుదురో అది వికలగతి యనబడును అసలు వక్రగమనమనునది సాపేక్షమే గాని, యదార్ధమునకు గ్రహము వెనుకకు వెళ్లుట జరుగదు.

**వక్రాది లక్షణములను శాస్త్రాంతరమందు-ఇట్లు చెప్పబడినవి.**

**శ్లో॥ ఆదిత్యాన్నవమంవక్రం షష్టాష్టమ మనుక్రమం ।**
**సప్తపంచమహావక్రం శేషం చారమితిస్మృతమ్ ॥**

శ్రీధర పద్ధతియందు గ్రహముల బలాబలముల గణితవిధానము స్పష్టముగా చెప్పబడినది.

**ఇతిగోవింద సోమయాజి కృతౌ బృహజ్జాతక**

**వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం**

**ద్వితీయోధ్యాయః**

★★★

# తృతీయాధ్యాయః

## వియోని జన్మాధ్యాయః

1. శ్లో॥ క్రూరగ్రహైస్సుబలిభిర్విబలైశ్చ సౌమ్యైః
క్లీబేచతుష్టయగతే తదవేక్షణాద్వా ।
చంద్రోపగద్విరసభాగ సమానరూపం
సత్త్వం వదేద్యదిభవేత్ స వియోనిసంజ్ఞః ॥

**దశాధ్యాయి :**

వివిధ యోనులు అనగా జంతు-పక్షి-వృక్షజన్మను చెప్పుచున్నాడు. కాలాత్మ అయిన బ్రహ్మ రచించుచున్నాడు. జన్మ-ఆధాన-ప్రశ్నయందు ఇది వినియోగ మగును.

చంద్రునియొక్క ద్వాదశాంశవలన వియోనిజన్మ తెలియబడును. క్రూర గ్రహములు బలముగానుండి, సౌమ్యగ్రహములు బలహీనముగా నున్నపుడు శని-బుధులు కేంద్రమందున్నపుడు వియోనిజన్మ తెలుపదగును.

మానవరాశులు కాని రాశులలో చంద్రద్వాదశాంశ యున్నపుడు

| | | |
|---|---|---|
| మేషద్వాదశాంశ | - | మేక - గొర్రి మొ॥ |
| వృషభ ద్వాదశాంశ | - | పశువులు |
| కర్కాటకము | - | పీత మొ॥ |
| సింహము | - | సింహ - వ్యాఘ్ర - శునక - మార్జాల. |
| వృశ్చికము | - | సర్ప - వృశ్చిక. మొ॥ |
| ధనుస్సు ఉత్తరార్ధం | - | అశ్వ - గర్దభ మొ॥ |
| మకరం పూర్వార్ధం | - | హరిణం |
| మకరం ఉత్తరార్ధం | - | మండూకాది జలచరములు |
| మీనము | - | మత్స్యము మొ॥ |





ఈ చంద్రద్వాదశాంశ దిననక్షత్ర ప్రమాణములో 12వ భాగము అనగా, 24 గం॥ నక్షత్రమున్నరోజున 1ద్వాదశాంశ 2గం॥లుండును. మేషరాశియందు అశ్వనీ నక్షత్ర ద్వాదశాంశ మేషాదిగాను, వృషభరాశియందున్న నక్షత్రముల ద్వాదశాంశ వృషభాది - మేషాంతముగాను లెక్కించవలయును. ద్వాదశాంశలకు అధిదేవతలు గణేశ - అశ్వినీదేవతలు - యముడు - సర్పము ఈ నలుగురే 3సార్లు ఆవృతమగుదురు.

ఈ చంద్ర ద్వాదశాంశ వలన పృష్ట - నష్ట - ముష్టి గతములు చెప్ప వచ్చును.

"చంద్రోపగద్విరసభాగ" అని చెప్పుటవలన - రసభాగ అనగా షష్ఠాంశ $-5^0$ ద్వి అని చెప్పుటవలన - $10^0$ భాగలు - అనగా రాశిలో $10^0$ భాగలు కల ద్రేక్కాణము సూచింపబడినది - వీటికి "సమానరూపం" అనుటవలన ద్రేక్కాణానుసారముగా చోరాది ఆకృతి, భోజన ప్రశ్నయందు భోక్త రూపము తెలియదగును.

**కృష్ణీయమందు :**

శ్లో॥ యాదృగ్భవతి విలగ్నే ద్రేక్కాణే భవతితాదృశశ్చోరః ।
కేంద్రగతోవా యాదృగ్గ్రహస్తు తాదృగ్వి నిర్దేశ్యః ॥

"సమానరూపం" అని చెప్పుటవలన ఆ రాశితో సమానమైన "నగరారణ్య జలస్థల-మనుష్య, చతుష్పద, విహంగ, సర్పాదులు నిరూపించవచ్చును.

2. శ్లో॥ పాపాబలినః స్వభాగగాః
పారక్యే విబలాశ్చ శోభనాః ।
లగ్నంచ వియోని సంజ్ఞితం
దృష్ట్వాత్రాపి వియోనిమాదిశేత్ ॥

**దశాధ్యాయి :**

పాపులు బలవంతులైనపుడు అనగా స్వభాగలు పొందినపుడు, సౌమ్యులు ఇతరుల భాగలు పొంది బలహీనులైనపుడు, లగ్న-ఆరూఢ-చంద్ర రాశులను పరీక్షించి పూర్వ శ్లోకములో చెప్పిన విధముగా గురు-దైవ-శాస్త్రసేవాపరిశుద్ధ బుద్ధులై దేశకాలాను రూపముగా ఫలితములు చెప్పవలయును.

ఉదా-మేషమునకు ఉష్ణ-శాక-లఘుభుక్తి-సంచారశీలత-చిప్పిన శిరస్సు-జలభయం-ఇత్యాదులు, ఆయారాశుల ఆకృతి స్వభావాదులు శాస్త్రము చేతను, లోకముచేతను అభ్యూహించి చెప్పవలయును.

**3. శ్లో॥ క్రియఃశిరో వక్త్రగళే ద్వితీయః**
**పాదాంసకే పృష్ఠమురోఽథ పార్శ్వే ।**
**కుక్షిస్త్వపానోఽంఘ్ర్యథ మేఢ్రముష్కౌ**
**స్ఫిక్పుచ్ఛ మిత్యాహ చతుష్పదాంగే ॥**

**దశాధ్యాయి :**

జంతువుల అవయవ విభాగములు - మేషము-శిరస్సు, వృషభము-ముఖము, మెడ, మిధునం-ముందుకాళ్లు,భుజములు, కర్కాటకం-వీపు, సింహం-రొమ్ము, కన్య-పక్కభాగములు, తుల-కడుపు, వృశ్చికము-గుదము, ధనుస్సు-వెనుకకాళ్లు, మకరము-మర్మాంగము, కుంభం-పిర్రలు, మీనము-తోక.

**4. శ్లో॥ లగ్నాంశకాత్ గ్రహయోగేక్షణా ద్వా**
**వర్ణాన్ వదేత్ బలయుక్తా ద్వియోనౌ ।**
**దృష్ట్యా సమానాం ప్రవదేచ్చ సంఖ్యాం**
**రేఖాంవదేత్ స్మరసంస్థైశ్చ పృష్ఠే ॥**





**దశాధ్యాయి :**

వియోనజన్మల వర్ణము తెలుపుచున్నాడు. లగ్ననవాంశ నుంచికాని, లగ్న మందున్న గ్రహము వలనకాని, లగ్నమును చూచు గ్రహమువలనకాని ఆ యా వర్ణములను తెలుపవలెను. వాటి శరీరమందున్న చారలను, మచ్చలను సప్తమమందున్న గ్రహమునునసరించి, వీపుపైనున్న చారలను తెలుపవలయును.

సారావళియందు కూడా ఈ విషయము విపులముగా తెలుపబడినది.

ఈ విధముగానే నామనిరూపణ చేయవచ్చును. రాశికి కొన్ని నిర్దిష్ట అక్షరములున్నవి. 30 తమిళఅక్షరములు. మీనాదిగా వెనుకకు లెక్కించి 24 అక్షరములు సింహము వరకు రాశికి 3 చొప్పున ఏర్పరచవలయును. ల నుంచి హ వరకు 6 అక్షరములు 2సార్లు లెక్కించవలయును. 36 ద్రేక్కాణములకు ఈ విధముగా అక్షరములు కుదురును.

గ్రహములకు కొన్ని నిర్దిష్ట అక్షరములున్నవి.

**శ్లో॥ అఇఉఏఓ భూతావర్ణాః సప్తవర్గాశ్చ స్వరాః ।**
**క్రమాదర్కార శుక్రజ్ఞ జీవార్కీందు రగాత్మకాః ॥**

రాశిననుసరించి "పేరులోని అక్షరములు ఎన్నిఉండునో" తెలియజేయవచ్చును.

**శ్లో॥ ద్వ్యక్షరంచ చరే రాశౌ స్థిరేతుచతురక్షరం।**
**ఉభయే వర్ణత్రయం విద్యాత్ తనామభేద సమన్వితమ్ ॥**

సంఖ్యా విషయము తెలుసుకొనదలచిన ప్రతీచోటా, నష్టద్రవ్యమందు లాభద్రవ్యమందు - పుత్ర సంఖ్య తెలుసుకొనుటకు - లగ్నమును ఎన్ని కిరణము లతో గ్రహము చూచుచున్నదో తెలుసుకొని ఆ సంఖ్య చెప్పవలయును. పుత్రస్థాన మును ఎన్ని గ్రహములు చూచుచున్నవో అంత తసంతానము చెప్పవలెను.

శ్లో॥ **యావంతో వీక్షంతే పుత్ర గృహం**
**పుత్రకాస్తు తావంతః ॥** అని చెప్పబడినది.

5\. శ్లో॥ **ఖగే దృగాణే బలసంయుతే నవా**
**గ్రహేణయుక్తే చరభాంశకోదయే ।**
**బుధాంశకేవా విహగాః స్థలాంబుజాః**
**శనైశ్చరేంద్వీక్షణ యోగసంభవాః ॥**

**దశాధ్యాయి :**

పక్షి ద్రేక్కాణములందు శనిచంద్రులున్ననూ, చూచిననూ భూమి యందు పుట్టిన పక్షులు - జల సంబంధ పక్షులు జన్మించినట్లు తెలియవలయును. బలవంతుడైన గ్రహముతో చరరాశి - చరనవాంశ శనితో కూడిన, చూడబడినా పక్షిజన్మ తెలుపవలెను. జన్మలగ్నము బుధనవాంశను పొంది, శనియున్నా చూచినా భూచరపక్షి జన్మ, చంద్రుడున్నా చూచినా జలచర పక్షి జన్మ తెలియ వలయును.

పక్షిద్రేక్కాణములేవి యనగా, మిధునంలో 2వది, సింహంలో 1వది, తులలో 2వది, కుంభములో 1వది అగుచున్నవి. చోరప్రశ్నయందు పక్షి ఎత్తుకొనిపోవుట దీనివలన తెలియును.

6\. శ్లో॥ **హోరేందుసూరి రవిభిర్విబలై స్తరూణాం**
**తోయస్థలే తరుభవోంశ కృతః ప్రభేదః ।**
**లగ్నాత్ గ్రహస్థలజలర్క్ష పతిస్తు యావాన్**
**తావంత ఏవ తరవః స్థలతోయజాతాః ॥**

**దశాధ్యాయి :**

లగ్నము-చంద్రుడు-సూర్యుడు-గురుడు బలహీనముగానున్నచో వృక్షములు జన్మించును.





జాతకవిషయమందు కూడా పైన పేర్కొన్నవారు బలహీనులైనచో పుట్టిన వారు వృక్షములు వలె ఆత్మప్రభావహీనులై పరాధీనులై జీవింతురు.

వృక్షజన్మమునందు జల-స్థల భేదమును లగ్నకాలనవాంశ ననుసరించి యుండును.

**సారావళి యందు :**

శ్లో॥ **లగ్నార్క సూరిచంద్రైరబలైశ్చైషైశ్చమూలయోనిఃస్యాత్ ।**
**స్థలజలభవనవిభాగో వృక్షాదీనాం ప్రభేదకరః ॥**

"లగ్నాత్ గ్రహ" అనిచెప్పుట వలన సంఖ్యా విషయములోను, ఇతరత్ర కూడా అనిష్టకాలమును సూచించు విషయము నిరూపించవచ్చును.

**క్లేశములు పొందు సమయము గూర్చి**

శ్లో॥ **లగ్నాద్యావతి భేపాపః తావత్య బ్దేఽహ్ని మాసివా।**
**పక్షేక్షణేయనే చర్తా లగ్నే శస్యోదితే వ్యధా॥**

లగ్నమునుండి ఎన్నవరాశిలో పాపులుందురో అన్నవ సం॥రం, నెల, పక్షం, రోజు మొ॥లలో లగ్నాధిపతి అక్కడ సంచరించునపుడు బాధలు కలుగును.

7\. శ్లో॥ **అంతస్సారాన్‌జనయతి రవి ర్దుర్భగాన్ సూర్యసూనుః**
**క్షీరోపేతాన్ తుహినకిరణః కంటకాఢ్యాంశ్చ భౌమః**
**వాగీశజ్ఞౌ సఫలవిఫలౌ పుష్పవృక్షాంశ్చ శుక్రః ।**
**స్నిగ్ధానిందుః కటుకవిటపాన్ భూమి పుత్రోపి భూయః ॥**

**దశాధ్యాయి :**

వృక్షములను మరింత సూక్ష్మముగా తెలుసుకొనుట చెప్పుచున్నారు. సూర్యుడు నవాంశాధిపతి అయిన అంతఃసారములుగల చందనం, కొబ్బరి ఆకులు లేనివిగా తెలుసుకొనవలెను. శని విషవృక్షములు - తినుటకు

పనికిరానివి, చంద్రుడు - పాలుగారునవి, తినుటకు యోగ్యమైనవి. కుజుడు - తాడి, ముళ్లచెట్లు - మామిడి - పనస - మిరియం - ఆవాలు మొ॥ బుధుడు - ఫలములేని చెట్లు, కంద - తీగ ప్రధానముగా గలవి, గురుడు - ఫలవృక్షములు, పెద్ద పెద్ద కాయలు, ఫలములు గలవి, గుమ్మడి మొ॥ శుక్రుడు - పుష్పవృక్షములు, పరిమళముగల చెట్లు, ఫలపత్రములు అధికముగా గలవి, నూనిగలవి - కుజ - చంద్రులను "భూయః" అని రెండుసార్లు తెలుపుటచేత, మృదువుగా నుండునవి, నునుపుగా నుండునవి చంద్రునకు, కఠినమైన పెళుసు గలవి కుజునకు చెందును.

**8. శ్లో॥ శుభోఽశుభర్క్ష రుచిరం కుభూతలే**
**కరోతి వృక్షం విపరీత మన్యథా ।**
**పరాంశకే యావతి విచ్యుతః స్వకాత్**
**భవంతితుల్యాస్తరవస్తథావిధాః ॥**

## దశాధ్యాయి :

ఆధారాధేయ సంబంధమయుచేత జన్యజనకములను చెప్పుచున్నాడు. రాశి ఆధారము-గ్రహము ఆధేయము.

లగ్ననవాంశాధిపతి శుభుడై అశుభరాశినిపొందిన మంచివృక్షము, చెడ్డ భూములందు పుట్టును. పాపగ్రహము శుభరాశిని పొందినపుడు చెడ్డవృక్షము లందు సుందర ప్రాంతభూములందు పుట్టును.

గుణదోషనిరూపణకు, ఆధారమైన గ్రహమును, ఆధేయమైన రాశిని గ్రహించవలయును.

భార్యాధిపతి శుభుడై, అశుభరాశియందున్నచో భార్య, కు గృహమున జన్మించినదగును. దీనికి వ్యతిరేకముగా నున్న వ్యతిరేకఫలితమగును. శుభాశుభ దృష్టియోగము కూడా ఆలోచించవలయును లగ్నోదయ నక్షత్రమునుండి, ఫలకారకగ్రహ నక్షత్రము వరకు, సంఖ్యగా తెలుసుకొనవలెను.





## షట్పంచాశిక యందు :

**శ్లో॥ ఉదయర్క్ష చ్చంద్రర్క్షం భవతి తు**
**యావద్భిర్నైస్తు తావద్భిః ।**
**ఆగమనం స్యాచ్ఛత్రోర్యది**
**మధ్యేన గ్రహః కశ్చిత్ ॥**

శత్రు ఆగమన విషయమై ప్రశ్నఫలము చెప్పబడినది.

**ఇతి గోవింద సోమయాజి కృతౌ బృహజ్జాతక**
**వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం**
**తృతీయాధ్యాయః**

# చతుర్థాధ్యాయః

# నిషేకాధ్యాయః

**1. శ్లో॥ కుజేందు హేతు ప్రతిమాసమార్తవం**
**గతే తు పీడర్క్ష మనుష్ణదీధితౌ ।**
**అతోఽన్యథాస్థే శుభ పుంగ్రహేక్షితే**
**నరేణ సంయోగముపైతి కామినీ ॥**

## దశాధ్యాయి :

స్త్రీలకు ఋతుకారణము కుజ-చంద్రులు. కుజుడు పైత్యకారకుడు. చంద్రుడు శోణితము. పిత్తముచేత శోణితము క్షుభితమైనపుడు స్త్రీలకు రజస్సు కలుగును.

స్త్రీ జన్మరాశినుంచి అనుపచయ రాశులలో (1-2-4-5-7-8-9-12) చంద్రుడుండి, కుజునిచే, చూడబడుచుండగా గర్భధారణకు అనుకూలమైన ఆర్తవము కలుగును.

పురుషుని జన్మరాశినుండి ఉపచయరాశులలో (3-6-10-11) చంద్రుడుండి, శుభుడగు గురునిచేతగాని, సూర్యునిచేతగాని, బలవంతుడైన బుధునిచేతగాని చూడబడినపుడు స్త్రీ, పురుషునితో సంయోగ సుఖము పొందును. అది సఫలమగును.

**వాగ్భటుడు :**

**శ్లో॥ క్షామప్రసన్నవదనాం స్ఫురచ్ఛ్రోణి పయోధరాం ।**
**ప్రస్తాక్ష కుక్షిం పుంస్కామాం**
**విద్యాదృతుమతీం స్త్రియామ్ ॥**

**రత్నమాల యందు :**

**శ్లో॥ ద్యూనజన్మ రిపులాభఖత్రిగశ్చంద్రమా**
**శ్శుభఫలప్రద ఉక్తః॥**

గ్రహముల అన్యోన్య సంబంధములలో దృష్టికే పాధాన్యత కలదు. ఏరాశి యందుగాని, గ్రహముపైగాని, గ్రహదృష్టి పడునో అక్కడ ఆగ్రహముయొక్క స్వశక్తి సంపాతము కలుగును. గ్రహముల కలయిక కంటే దృష్టికే విశేషప్రాధాన్యత కలదు.

**2. శ్లో॥ యధాస్తరాశిర్మిధునం సమేతి**
**తథైవ వాచ్యో మిథున ప్రయోగః ।**
**అసద్గ్రహాలోకిత సంయుతేஉస్తే**
**సరోష ఇష్టై స్స విలాస హాసః ॥**

**దశాధ్యాయి :**

జన్మలగ్నమునకుగాని, గర్భాధాన, ప్రశ్నలగ్నములకు గాని సప్తమరాశి ననుసరించి సంభోగ విషయములు తెలుసుకొనవచ్చునం. అది ద్విపద-





చతుష్పద-కీట రాశులయినచో ఆ రాశుల రూప స్వభావానుసారముగా సురతము కలుగును.

సప్తమరాశి పాపగ్రహదృష్టమైనపుడు పాపగ్రహయుతి యున్నపుడు, రహః కేళి, రోష-కోప నిష్టు ర సమన్వితమైయుండును. శుభదృష్టిమైనచో లలిత హాస విలాసలతో మనోహరముగా నుండును. సప్తమము మేషమైనచో వనితా ప్రియముగానూ, వృషభము సంతోషముగాను, మిధునము సురతోపచార కుశలత, కర్కాటకము స్త్రీని జయించునది, సింహము స్త్రీ ద్వేషత, కన్య సుఖము, తుల స్త్రీదిపైచేయి, వృశ్చికము స్త్రీకి సుఖహీనత, ధనుస్సు పురుషాధిక్యత, మకరం - కుంభరాశులలో సుఖములేనిది, మీనము స్త్రీ జయముగానూ ఉండును.

సురతప్రయోగము, బేసిరాశి అయిన 1 లేదా 3 సార్లు, యుగ్మరాశి అయిన 2-4 సార్లు జరుగును.

సప్తమరాశి గ్రహానుసారముగా పడకగది - దీపము - శయ్య - వస్త్రము - మొ॥ నిర్ణయించవచ్చును.

ప్రథమ రజస్వల విషయములో

**సారావళి యందు :**

**శ్లో॥ చంద్రకుజేన దృష్టే పుష్పవతీ సహవిటేన సంయోగః**
**రాజపురుషేణ రవిణా రవిజేనాప్నోతి భృత్యేన ॥**

జాతకమందు కూడా సప్తమరాశి వలన భార్యాగుణములు తెలుసుకొనవచ్చును.

**3. శ్లో॥ రవీందు శుక్రావనిజైః స్వభాగగైః**
**గురౌ త్రికోణోదయ ధర్మஉగేపివా ।**
**భవత్యపత్యం హి విబీజి నామిమే**
**కరా హిమాంశోర్విదృశా మివాఫలాః ॥**

**దశాధ్యాయి :**

పురుషుని ఉపచయరాశులలో సూర్య-శుక్రులు, స్త్రీ ఉపచయ రాశులలో కుజ-చంద్రులు స్వనవాంశ పొందినచో గర్భము కలుగును.

గురుడు 1-5-9 స్థానములందున్ననూ గర్భధారణ జరుగును.

మరొక విశేషము కలదు. గర్భాధాన కాలమున పురుషునికి కుడినాసిక యందు శ్వాస సంచరించినచో పుత్రుడు కలుగును. ఎడమనాసిక యందు శ్వాస సంచరించిన పుత్రిక కలుగును.

సూర్యచంద్ర శుక్రులు బలహీనులుగా నున్నపుడు జన్మించినవారు నిర్బీజులగుదురు.

సూర్యుడు ఆత్మ - చంద్రుడు మనస్సు - శుక్రుడు శుక్లము, ఆత్మమనస్సం యోగము వలన జ్ఞానముద్భవించి, ఇంద్రియములు విషయ సంయోగము చెందినపుడు కామవాంఛలు కలిగి స్త్రీతో సంగమించినపుడు ఆమె గర్భమందు ప్రవేశించిన రేతస్సు గర్భకారణమగును.

**4. శ్లో॥ దివాకరేంద్వోః స్మరగౌ కుజార్కజౌ**
**గదప్రదౌ పుంగల యోషితోస్తదా ।**
**వ్యయస్వగౌ మృత్యుకరౌ తథాయుతౌ**
**తదేక దృష్ట్యా మరణాయ కల్పితౌ ॥**

**దశాధ్యాయి :**

గర్భాధాన సమయమున సూర్యచంద్రులకు, శని, కుజులు సప్తమమున ఉన్న, స్త్రీ పురుషులిరువురూ రోగము పొందెదరు.

సూర్యచంద్రులకు, కుజశనులలో ఒకరు 12లోను, మరొకరు 2లోను యున్న మరణము కలిగింతురు. వీరిలో ఒకరు కలసి, మరొకరిచే చూడబడిననూ మరణప్రదులగుదురు.





**2. శ్లో॥ దివార్కశుక్రౌ పితృమాతృ సంజ్ఞితౌ**
**శనైశ్చరేందూ నిశి తద్విపర్యయాత్ ।**
**పితృవ్య మాతృష్వసృసంజ్ఞితౌ తు తౌ**
**అథోజయుగ్మర్క్ష గతౌ తయోశ్శుభౌ ॥**

**దశాధ్యాయి :**

పగటి సమయమందు జన్మించిన వారికి రవి-శుక్రులు పితృమాతృ కారకులగుదురు. రాత్రి యందు జన్మించినవారికి శని-చంద్రులు పితృ-మాతృ కారకులగుదురు.

అదేవిధముగా పగటి సమయమందు జన్మించిన వారికి శని పినతండ్రి-పెదతండ్రి కారకుడు. చంద్రుడు పినతల్లి-పెదతండ్రి కారకుడగును.

రాత్రియందు జన్మించినవారికి రవి పినతండ్రి-పెద్దతండ్రి కారకుడు, శుక్రుడు పినతల్లి-పెదతల్లి కారకుడగును.

పగలు జన్మించివారికి శుక్రుడు మాతృకారకుడగును గాన, కళత్ర కారకత్వము తగ్గును. సప్తమాధిపతికే కళత్రకారకత్వము కలుగును.

రవిశుక్రులు బేసిరాశులందును - శనిచంద్రులు సరిరాశులందును శుభఫలమిచ్చెదరు.

**శ్లో॥ సూర్యో యస్మిన్నవాంశేస్యాత్ తద్దశాయాంపితృక్షయః ।**
**చంద్రేణ మాతృనాశ స్స్యాదథ యుక్తగ్రహేణ వా ॥**

పితృ-మాతృ కారక గ్రహములు ఏ నవాంశయందుండునో వారిదశల యందు పితృ-మాతృ మరణము కలుగును.

**తథాచోక్తమ్ :**

**శ్లో॥ భానుః పితాచ జంతూనాం చంద్రోమాతా తథైవచ ।**
**తయోర్బలా బలం జ్ఞాత్వా పితృమాతృ గుణాన్ వదేత్ ॥**

పితృ-మాతృ కారకుల బలాబలములను ఆలోచించి వారివారి గుణములను నిర్దేశించాలి.

**6. శ్లో॥ అభిలషద్భిరుదయర్క్షమసద్భిర్మరణమేతి**
**శుభదృష్టి మయాతే ।**
**ఉదయరాశి సహితేచ యమే స్త్రీ**
**విగలితోడుపతి భూసుత దృష్టే ॥**

**దశాధ్యాయి :**

ఆధానలగ్నమునకు ద్వాదశమున క్రూరగ్రహముండి, శుభగ్రహ దృష్టిలేనిచో గర్భిణీ స్త్రీ మరణించును.

లగ్నమందు గుళిక-శనులుండి క్షీణచంద్ర-కుజులచేత చూడబడినను స్త్రీ మృతిచెందును.

**7. శ్లో॥ పాపద్వయ మధ్య సంస్థితౌ**
**లగ్నేందూ నచసౌమ్య వీక్షితౌ ।**
**యుగపత్ పృథగేవ వా వదేత్**
**నారీ గర్భయుతా విపద్యతే ॥**

**దశాధ్యాయి :**

ఆధాన లగ్నము-చంద్రుడు క్రూరగ్రహముల మధ్యనుండి, శుభగ్రహ వీక్షణలేనిచో గర్భవతి మరణించును.

లగ్న-చంద్రులు, విడివిడిగా గాని, కలసిగాని, పాపమధ్యస్థులైనపుడు ఇది సంభవించును.

**సారావళియందు :**

**శ్లో॥ అథవా నిషేక కాలే విలగ్న సంస్థా యథారుధిరమందౌ**
**తద్గృహగతేఽథవేందౌ తదీక్షతేవా పతతి గర్భః ॥**

పై శ్లోకములో మరణము లేదా గర్భస్రావము చెప్పబడినది.





**8. శ్లో॥ క్రూరేశశినశ్చతుర్థగే**
**లగ్నాద్వా నిధనాశ్రితే కుజే ।**
**బంధ్వాంత్యగయోః కుజార్కయోః**
**క్షీణేందౌ నిధనాయ పూర్వవత్ ॥**

**దశాధ్యాయి :**

గర్భాధాన-జన్మలగ్నములకు, లగ్నము నుండి లేదా చంద్రరాశినుండి చతుర్థమున క్రూర గ్రహములుండి, అష్టమమున కుజుడున్ననూ, చతుర్థమున కుజుడు-ద్వాదశమున సూర్యుడున్ననూ క్షీణచంద్రుడైనచో గర్భిణి మృతి చెందును.

**9. శ్లో॥ ఉదయాస్తగయోః కుజార్కయో ర్నిధనం**
**శస్త్రకృతం వదేత్తథా।**
**మాసాధిపతౌ నిపీడితే తత్కాలే స్రవణం సమాదిశేత్॥**

**దశాధ్యాయి :**

లగ్నమున కుజుడు-సప్తమమున సూర్యుడున్నచో, గర్భవతి శస్త్రచికిత్స యందు మరణించును.

మాసాధిపతి రాహు-కేత్వాది క్రూరగ్రహములచే పీడింపబడినపుడు గర్భస్రావము కలుగును.

ప్రశ్నయందు కూడా ఇది సందర్భాను సారముగా వినియోగించును.

**10. శ్లో॥ శశాంక లగ్నోపగతైః శుభగ్రహైః**
**త్రికోణ జాయార్థ సుఖాస్పదస్థితైః ।**
**తృతీయలాభర్క్ష గతైరశోభనైః**
**సుఖీ చ గర్భో రవిణాభివీక్షితః ॥**

**దశాధ్యాయి :**

లగ్నముగాని-చంద్రుడుగాని శుభ గ్రహములతో కలసినపుడు, 5-9-7-2-4-10 స్థానములలో శుభగ్రహములు, 3-11 స్థానములలో క్రూరగ్రహము లున్నపుడు, సూర్యుని దృష్టి పొందినచో గర్భము సఫలముగా నుండును.

“త్రికోణ జాయార్థ సుఖాస్పద” అని చెప్పుటచేత ఒక క్రమము చెప్పబడినది. త్రికోణ శబ్దముచేత 1-5-9 స్థానముల వివక్షితములుకాగా, ఫలితకధన విషయములో ముందు లగ్నము ద్వారా ఆత్మనిరూపణం, జాతకుని విషయ ములు, అనంతరం పుత్రునివిషయములు, ధర్మస్థానవిషయములు, గృహస్థునకు భార్యావిషయములు, అన్ని కర్మలు ధనసాపేక్షకములు కావున ధనవిషయము, తద్వారా సుఖము-కీర్తి వరుసగా 1-5-9-7-2-4-10 విషయములు చెప్పవలయును.

**వాగ్భటుడు :**

**శ్లో॥ ఉత్తిష్ఠేత తతోఽత్యర్థమర్థేష్వర్థాను బంధుషు**
**నిందితం దీర్ఘమప్యాయు రసన్నిహిత సాధనమ్ ॥**

బంధువులగూర్చి, ఆయువును గూర్చికూడా వివరముగా పరిశీలించ వలయును.

**11. శ్లో॥ ఓజర్క్షే పురుషాంశకేషు బలిభిర్లగ్నార్క గుర్విందుభిః**
**పుంజన్మ ప్రవదేత్ సమాంశ సహితైర్యుగ్మేషు తైర్యోషితాం।**
**గుర్వర్కౌ విషమే నరం శశిసితౌ వక్రశ్చయుగ్మేస్త్రియం**
**ద్వ్యంగస్థా బుధవీక్షణాచ్చ యమళం కుర్వంతి పక్షేస్వకే ॥**

**దశాధ్యాయి :**

బలవంతులయిన సూర్య-చంద్ర-గురులు బేసిరాశులయందుండి, లగ్నము బేసిరాశి-నవాంశలయందున్న పురుష సంతానము కలుగునని, సరిరాశి నవాంశలయందున్న స్త్రీ సంతానము కలుగునని తెలుసుకొనవలయును.





కొన్నిసమరాశి-నవాంశలయందు కొన్ని బేసిరాశి-నవాంశలయందున్న బలాధిక్యమునుబట్టి నిర్ణయించవలయును.

సూర్య-గురులు బలవంతులై బేసిరాశియందు ఏ నవాంశమందున్ననూ పురుషసంతానమే కలుగును.

చంద్ర-కుజ-శుక్రులు సమరాశియందు ఏ నవాంశయందున్నా స్త్రీ సంతానమే కలుగును.

ఈ గ్రహములు ద్విస్వభావ రాశులందుండి బుధునిచే చూడబడుచున్న కవలసంతానము కలుగును. నవాంశ ననుసరించి పురుష-స్త్రీ జన్మము తెలుసుకొనవలయును.

మిధున-ధనుస్సులు పురుషరాశులు కన్యా-మీనములు స్త్రీరాశులు.

మిధున-ధనురాశులందు సూర్యగురులుండి, బుధునిచే చూడబడుచున్న పురుషకవలలు జన్మింతురు.

**ప్రశ్నశాస్త్రాంతరమందు :**

**శ్లో॥ ఆరూఢ లగ్నచ్ఛత్రేందు సుతధర్మాస్తగే కుజే ।**
**ఏషు వా తేన దృష్టేషు వక్తవ్యా త్వల్పపుత్రతా ॥**

**12. శ్లో॥ విహాయలగ్నం విషమర్క్ష సంస్థః**
**సౌరోపి పుంజన్మకరో విలగ్నాత్ ।**
**ప్రోక్త గ్రహాణా మవలోక్యవీర్యం**
**వాచ్యఃప్రసూతౌ పురుషోఽంగనావా ॥**

**దశాధ్యాయి :**

లగ్నముతప్ప మిగిలిన బేసిరాశులందు 3-5-7-9-11 లలో శని నపుంసక గ్రహమైననూ అచట ఉన్నఎడల పురుషసంతానము కలుగును.

సూర్య-గురులవల్ల పురుషసంతానము చంద్ర-కుజ-శుక్రులవల్ల స్త్రీసంతానము, వారివారి బలాబలానుసారముగా నిర్ణయించి చెప్పవలయును.

**13. శ్లో॥ అన్యోన్యం యదిపశ్యతః శశిరవీ యద్వార్కిసౌమ్యౌతథా**
**వక్రోవా సమగం దినేశమసమే చంద్రోదయౌచేత్స్థితా ।**
**యుగ్మౌజర్క్ష గతావపీందు శశిజౌ భూమ్యాత్మజేనేక్షితా**
**పుంభాగే సితలగ్నశీతకిరణాః షట్క్లీబయోగాస్మృతాః ॥**

## దశాధ్యాయి :

6నపుంసక జన్మయోగములు చెప్పుచున్నాడు. ఇవి జాతకుని జన్మకాల మందున్న సంతతి హానికరములగును.

1 - రవి-చంద్రులు పరస్పర దృష్టిచేత

2 - శని-బుధుల పరస్పర వీక్షణచేత

3 - సమరాశిలోనున్న సూర్యుని కుజుడుచూచినను

4 - బేసిలగ్నము-సరిచంద్రరాశి అయి సమరాశినుండి కుజుడు చూచినను,

5 - చంద్రుడు సమరాశియందుండి, బుధుడు బేసిరాశి యందుండి కుజునిచే చూడబడినను,

6 - లగ్న-చంద్ర-శుక్ర నవాంశలు పురుషనవాంశలయినచో క్లీబయోగము.

**14. శ్లో॥ యుగ్మేచంద్ర సితాదథౌజభవనే స్యుఃజ్ఞార-జీవోదయా**
**లగ్నేందూ నృనిరీక్షితౌచ సమగౌ యుగ్మేషు వా ప్రాణినః**
**కుర్యుస్తే మిథునం గ్రహోదయగతాన్ ద్వ్యంగాశకాన్ పశ్యతి**
**స్వాంశే జ్ఞే త్రితయం జ్ఞగాంశక వశాత్ యుగ్మంత్వమిశ్రైస్సమమ్ ॥**





## దశాధ్యాయి :

పురుష-స్త్రీల కవలజన్మములు చెప్పుచున్నాడు. చంద్ర శుక్రులు సరిరాశియందుండి లగ్న-కుజ-బుధ-గురులు బేసిరాశిఅయినచో ఒక స్త్రీ శిశువు-ఒక పురుషశిశువు జన్మింతురు.

లగ్నము-చంద్రుడు సరిరాశి యందుండి, పురుష గ్రహములచే చూడబడిన ఒక పురుష-ఒక స్త్రీ కవలలు జన్మిస్తారు.

గ్రహములన్ని లగ్నమందుండి, అవి ద్విస్వభావ నవాంశనుపొంది, వాటిని ద్విస్వభావ నవాంశయందున్న బుధుడు చూచిన ముగ్గురు శిశువులు ఒకేసారి జన్మింతురు.

గ్రహములు మిశ్రమముగా నున్న బలాధిక్యమును బట్టి స్త్రీ-పురుష వివక్ష చేయవలయును.

బుధుడు ద్విస్వభావమందున్న గ్రహములనూ, ద్విస్వభావము పొందిన నవాంశలగ్నమును కూడా తప్పక చూడ వలయును.

**15. శ్లో॥ ధనుర్ధరస్యాంతగతే విలగ్నే**
**గ్రహైస్తదంశో పగతైర్బలిష్ఠైః ।**
**జ్ఞేనార్కిణా వీర్యయుతే న దృష్టే**
**సంతిప్రభూతా అపి కోశసంస్థాః ॥**

## దశాధ్యాయి :

లగ్నము ధనురాశి అంత్యనవాంశ అయి, ధనుర్నవాంశ పొందిన బలమైన గ్రహము చేతను, బుధునిచేతను, శనిచేతను లగ్నము చూడబడినచో గర్భకోశ మందు అనేక ప్రాణములున్నవని గ్రహించవలయును.

ఈ యోగము దుర్లభము కావున ఫలితము కూడా దుర్లభమే.

16. శ్లో॥ కలలఘనాంకురాస్థి చర్మాంగజ చేతనతాః
సిత కుజ జీవ సూర్యచంద్రార్కి బుధాః పరతః ।
ఉదయపచంద్ర సూర్యనాథాః క్రమశో గదితా
భవతి శుభాశుభంచ మాసాధిపతేః సదృశమ్ ॥

**దశాధ్యాయి :**

గర్భాధాన కాలాదిగ 7 నెలలో కలలము మొ॥ ఏర్పడును.

ప్రథమ మాసమున-శుక్లశోణితములు బుడగవలె నుండును. ఈ నెలకు శుక్రుడధిపతి, రెండవనెలలో మాంసమగును. కుజుడధిపతి, మూడవనెలలో అంకురము ఏర్పడును గురుడధిపతి, నాల్గవనెలలో ఎముకలు ఏర్పడును. సూర్యడధిపతి, ఐదవనెలలో చర్మమేర్పడును. చంద్రుడధిపతి. ఆరవనెలలో శరీరావయవములు, రోమములు ఏర్పడును శనిఅధిపతి. ఏడవనెలలో జ్ఞానేంద్రియములేర్పడును బుధుడధిపతి.

మిగిలిన 8-9-10 మాసములలో ఆకలిదప్పికలు-ఉద్వేగములు-పరిపూర్ణ గర్భపక్వత కలుగును. వీటికి వరుసగా గర్భాధాన లగ్నాధిపతి చంద్రుడు-సూర్యుడు అధిపతులగుచున్నారు.

8వ మాసమందు గర్భమందున్న జీవుడు, తల్లి భుజించిన అన్నపానాదులను గ్రహించి సంతృప్తి పొందును.

సర్వత్రా గురుబలము బాగుండవలయును.

17. శ్లో॥ త్రికోణగేజ్ఞే విబలైస్తతో పరైః
ముఖాంఘ్రి హస్త ద్విగుణస్తదా భవేత్ ।
అవాగ్గవీందావశుభై ర్భ సంధిగైః
శుభేక్షితే శ్చే త్కురుతే గిరంచిరాత్ ॥





5-9 స్థానములందు బుధుడుండి, మిగిలిన గ్రహములు బలహీనము లైనచో శిశువుకు 4కాళ్లు 4చేతులు ఉండును.

చంద్రుడు వృషభమందుండగా, కర్కాటక-వృశ్చిక-మీన అంత్య నవాంశలందు, క్రూరగృహములన్న శిశువు మూగవాడగును. శుభులు చూచినచో మాటలు ఆలస్యముగావచ్చును.

18. శ్లో॥ సౌమ్యరాక్షంశే రవిజరుధిరౌ చేత్సదంతోఽత్రజాతః
కుబ్జస్వర్క్షే శశిని తనుగే మంద మాహేయ దృష్టే ।
పంగుర్మీ నే యమశశికుజై ర్వీక్షితేలగ్నసంస్థే
సంధౌ పాపేశశినిచజడస్స్యాన్నచేత్ సౌమ్యదృష్టిః ॥

**దశాధ్యాయి :**

సదంత-పంగు-కుబ్జయోగములు,-కుజ-శనులు, బుధుని రాశి-నవాంశల యందుండగా జాతకుడు దంతములతో పుట్టును.

చంద్రుడు కర్కాటక లగ్నమందుండి, శని-కుజులచే చూడబడిన జాతకుడు మరగుజ్జు గూని - అగును.

మీనలగ్నమందు చంద్ర-కుజ-శనులున్ననూ, మీనము లగ్నమై వారిచేత చూడబడిననూ శిశువు కుంటివాడగును.

శుభగ్రహములచే చూడబడినచో, ఈ యోగములు సంపూర్ణముగా ప్రాప్తించక, జాతకుడు మందబుద్ధి అగును.

19. శ్లో॥ సౌరశశాంక దివాకర దృష్టే
వామనకో మకరాంత్య విలగ్నే ।
ధీనవమోదయగైశ్చ దృగాణైః
పాపయుతైరభుజాంఘ్రి శిరాః స్యాత్ ॥

**దశాధ్యాయి :**

మకరాంత్య నవాంశలగ్నమై, సూర్య-చంద్ర-శనులచేత చూడబడిన జాతకుడు పొట్టివాడగును.

లగ్నముయొక్క 2-3 ద్రేక్కాణములు, పాపులతోయుండి, పాపులచే చూడబడిన భుజ-పాదహీనులు జన్మింతురు.

5-9 రాశుల ప్రధమద్రేక్కాణ పాపులచే ఆక్రాంతమైనచో శిరోబాధ, ద్వితీయద్రేక్కాణ పాపత్వముచే భుజబాధ, తృతీయద్రేక్కాణ పాపత్వముచే పాదబాధ కలుగునని తెలియవలెను.

**20 శ్లో॥ రవి శశియుతే సింహేలగ్నే కుజార్కనిరీక్షితే**
**నయనరహితః సౌమ్యాసౌమ్యైః సబుద్బుదలోచనః ।**
**వ్యయగృహగతశ్చంద్రో వామం హినస్త్యపరంరవిః**
**త్వశుభగదితా యోగాయాప్యా భవంతి శుభేక్షితాః ॥**

**దశాధ్యాయి :**

సింహలగ్నమునందు సూర్య-చంద్రులుండి కుజ-శనులచే చూడబడిన అంధుడు జన్మించును. సూర్యుడొక్కడేయుండి, కుజ-శనులచే చూడబడినచో కుడికన్ను లేనివాడగును.

చంద్రుడొక్కడేయుండి కుజ-శనులచే చూడబడిన ఎడమకన్ను లేని వాడగును.

పై యోగములకు శుభగ్రహ సంబంధమున్నచో నేత్రరోగములు కల వాడగును.

**21. శ్లో॥ తత్కాల మిందుసహితో ద్విరసాంశకోయః**
**తత్తుల్యరాశి సహితే పురతశ్శశాంకే ।**
**యావానుదేతి దినరాత్రి సమానభాగః**
**తావద్గతే దిన నిశోః ప్రవదంతి జన్మ ॥**





**దశాధ్యాయి :**

ప్రసవమెప్పుడు జరుగును?

ప్రశ్నలగ్నమునకు, చంద్రగ్రహద్వాదశాంశ ఎందుండునో, మేషమునుండి అన్నవరాశియందు పదవమాసమున చంద్రుడుండగా ప్రసవమగును.

**శాస్త్రాంతరమందు :**

**శ్లో॥ ఇందునవాంశ ద్వాదశాంశభాగే వినిర్దిశేచ్చంద్రమ్ ॥**

అని చెప్పబడినది. ప్రశ్నలగ్నము పగటియందు బలముకలదా? రాత్రియందు బలముకలదా? అనిచూచి, జననకాలము తెలుపవలెను.

ప్రశ్నలగ్నము తుల అయినచో అది దివాకాలమందు బలము కలది కావున, జాతకుడు పగటియందు జన్మించునని తెలుసుకొనవలయును.

**22. శ్లో॥ ఉదయతి మృదుభాంశే సప్తమస్థేచమందే**
**యది భవతినిషేక స్సూతిరబ్దత్రయేణ ।**
**శశినితు విధిరేవం ద్వాదశాబ్దే ప్రకుర్యాత్**
**నిగదితమిహ చింత్యం సూతికాలేఽపియుక్తా ॥**

**దశాధ్యాయి :**

గర్భాధాన లగ్నము, మకర-కుంభనవాంశలు పొంది, లగ్న సప్తమమున శనియున్నచో మూడు సం॥ల వరకూ సంతానము కలుగదు.

గర్భాధానలగ్నము కర్కాటక నవాంశను పొంది చంద్రునిచే చూడబడినచో 12 సం॥ల వరకూ సంతానము కలుగదు.

ఇది ప్రశ్నలగ్నమునకు కూడా వర్తించును.

**ఇతి గోవింద సోమయాజి కృతౌ బృహజ్జాతక**
**వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం**
**చతుర్థాధ్యాయః**

# పంచమాధ్యాయః

## జన్మాధ్యాయః

**1. శ్లో॥ పితుర్జాతః పరోక్షస్యలగ్నమిందావపశ్యతి ।
విదేశస్థస్య చరభే మధ్యాత్ భ్రష్టేదివాకరే ॥**

**దశాధ్యాయి :**

మాతృకారకుడైన చంద్రుడు, జన్మలగ్నమును చూడనిచో జాతకుడు జన్మించు సమయమున తండ్రిఅచట లేడని తెలుసుకొనవలెను.

సూర్యుడు చరరాశులందున్నచో తండ్రి ఇతరప్రాంతములందున్నట్లు తెలియవలయును.

8-9 స్థానములందు సూర్యుడున్నచో తండ్రి విదేశగతుడని తెలియవలెను.

**బ్రహస్పతి, వివాహప్రశ్నయందు :**

**శ్లో॥ యది నీచారిగో లగ్నమారూఢం వా నపశ్యతి
అర్కః స్త్రియః పితానాస్తి మాతేందుశ్చేత్తధావిధః ॥**

చతుర్ధరాశి గతుడయినచో గృహమునందే యున్నట్లు తెలుసుకొనవచ్చును. చంద్రచతుర్ధము కూడా తండ్రి దగ్గరఉండుటను సూచించును.

**2. శ్లో॥ ఉదయస్థేఽపి వా మందే కుజేవాస్తం సమాగతే ।
స్థితేవాంతః క్షపానాధే శశాంక సుతశుక్రయోః ॥**

**దశాధ్యాయి :**

శని లగ్నమందున్ననూ, సప్తమమున కుజుడున్ననూ, చంద్రుడు-బుధ శుక్రుల మధ్యనున్ననూ, జాతకుడు తండ్రి పరోక్షములోనుండగా జన్మించెనని తెలియవలయును.





**3. శ్లో॥ శశాంకే పాపలగ్నేవా వృశ్చికేశత్రిభాగగే
శుభైః స్వాయస్థితైర్జాతః సర్పస్తద్వేష్టితోఽపివా ॥**

**దశాధ్యాయి :**

చంద్రుడు పాపక్షేత్రమందుండి, లేదా లగ్నమందుండి 2-11లో శుభగ్రహములుండి వృశ్చికరాశి 3వ ద్రేక్కాణమునందు జననమైనచో సర్పము జన్మించును.

**కృష్ణీయము :**

**శ్లో॥ వృశ్చికమీన కుళీరాః సరీస్పపాణాం వదంతియోనిః ॥**

వృశ్చికరాశిలోని 3 ద్రేక్కాణములు అనగా వృశ్చిక-మీన-కర్కాటకములు సర్పద్రేక్కాణములనబడును.

ఇచట 'సర్ప' శబ్దము విషధర సూచకము. కనుక విషస్వభావము గలవారు జన్మింతురని ఊహించవలయును.

**4. శ్లో॥ చతుష్పద గతేభానౌ శేషైర్వీర్య సమన్వితైః ।
ద్వితనుస్థైశ్చయమలౌ భవతః కోశవేష్టితౌ ॥**

**దశాధ్యాయి :**

సూర్యుడు చతుష్పద రాశులందుండగా అనగా మేష-వృషభ-సింహ-ధను పరార్ధ-మకర పూర్వార్ధములు, మిగిలిన గ్రహములు బలవంతులై ద్విస్వభావ రాశులందున్నచో కోశము చుట్టుకొనిన కవలలు జన్మింతురు.

**5. శ్లో॥ ఛాగసింహ వృషేలగ్నేతత్‌స్థే సౌరేఽధవాకుజే ।
రాశ్యంశ సదృశే గాత్రే జాయతే నాళవేష్టితః ॥**

**దశాధ్యాయి :**

మేష-సింహ-వృషభములు లగ్నమై అచట కుజుడుగాని - శనిగాని యున్నచో శిశువు బొడ్డుతాడు చుట్టుకొని జన్మించును.

ఆ రాశి-అంశననుసరించిన అవయవమునకు ఆపేగు చుట్టుకొనబడి యుండును.

**6. శ్లో॥ నలగ్నమిందుంచ గురుర్నిరీక్షితే**
**న వా శశాంకో రవిణా సమాగతః ।**
**సపాసకోఽర్కేణ యుతోఽథవాశశీ**
**పరేణ జాతం ప్రవదంతి నిశ్చయాత్ ॥**

## దశాధ్యాయి :

3 పరజాతయోగములు తెలుపుచున్నాడు. లగ్నమునుకాని చంద్రునికాని గురుడు చూడని యెడల జాతకుడు ఇతరులకు పుట్టినవాడని తెలియవలయును.

లగ్న-చంద్రులు గురు నవాంశపొందినచో పైనచెప్పినది అన్వయించదు.

సూర్య-చంద్రులు ఒకేరాశిలో నున్నపుడు, వారికి గురుదృష్టిలేనిచో పరజాతుడని తెలియవలయును. ఈ యోగమునందు చంద్రుడు గురుక్షేత్ర ద్రేక్కాణ-నవాంశాదులను పొందిన, ఇతరఅంశలను పొందినా జారజాతుడు కాదు.

సూర్యుడు-చంద్రుడు, కుజ-శనులలో ఒకరితో కలసినచో జారజాతుడని తెలియవలెను.

చంద్రునికి గురుసంబంధమున్నచో వర్తించదు.

## గార్గిః :

**శ్లో॥ గురుక్షేత్రగతే చంద్రే తద్యుక్తే వాన్యరాశిగే ।**
**తద్ద్రేక్కాణే తదంశేవా నపరైర్జాతఇష్యతే ॥**

చంద్రునకు ఏవిధముగానైనా గురుసంబంధమున్న ఎడల జాతకుడు జారజాతుడు కాదు.





**7. శ్లో॥ క్రూరర్క్షగతావశోభనౌ సూర్యాద్ద్యూన నవాత్మజస్థితౌ ।**
**బద్ధస్తు పితా విదేశగఃస్వేవా రాశివశాత్తథాపథి ॥**

## దశాధ్యాయి :

క్రూరరాశులందు 2 క్రూరగ్రహములుండి సూర్యుడున్న రాశికి 7-9-5 స్థానములందు శని-కుజులున్నచో జాతకుని తండ్రి విదేశమునందు బంధితుడై యుండును. లేదా స్వదేశమునందే బంధితుడైగాని-మార్గమధ్యమునకాని చిక్కుకొని యుండును.

సారావళియందు కూడా ఇదే చెప్పబడినది.

**8. శ్లో॥ పూర్ణే శశిని స్వరాశిగే**
**సౌమ్యే లగ్నగతే శుభే సుఖే ।**
**లగ్నే జలజేఽస్తగేఽపి వా**
**చంద్రేపోతగతా ప్రసూయతే ॥**

## దశాధ్యాయి :

చంద్రుడు కర్కాటకమందుండి, లగ్నమందు బుధుడుండి, గురుడు చతుర్థ మందున్నచో, స్త్రీ నావయందు ప్రసవించును.

జలరాశులలో ఒకటి లగ్నమై (కర్కాటక-మకరఉత్తరార్ధ-మీనరాశులు) సప్తమమందు చంద్రుడున్న, స్త్రీ నావయందు ప్రసవించును.

**9. శ్లో॥ ఆప్యోదయ మాప్యగశ్శశీ**
**సంపూర్ణ స్సమవేక్షతేఽథవా ।**
**మేషూరణ బంధు లగ్నగః స్యాత్**
**సూతి సలిలే న సంశయః ॥**

**దశాధ్యాయి :**

జలరాశిలగ్నమై, చంద్రుడు జలరాశియందున్నచో మరియు జలరాశిలగ్నమై చంద్రుడు చతుర్థ-దశమములలో ఉన్ననూ నదీ-తటాక-సాగర-జల సమీపము లందు ప్రసవమగును.

సప్తమ స్థానము వరుణదిక్కు కావున సప్తమచంద్రుడు నదీజల-సముద్ర జలసూచకుడగును.

వర్షప్రశ్నయందు కూడా ఉపయోగించును.

**బృహత్సంహిత యందు :**

**శ్లో॥ వర్షప్రశ్నే సలిల విషయం రాశి మాశ్రిత్యచంద్రః ।**
**లగ్నంయాతో భవతి యది వా కేంద్రగఃశుక్లపక్షే ॥**

అదేవిధముగా ఆగ్నేయదిగ్భాగము గ్రహసహితమైనచో జలము లభించదని తెలుసుకోవాలి.

**10. శ్లో॥ ఉదయోడుపయోః వ్యస్థితే**
**గుప్త్యాం పాప నిరీక్షితే యమే ।**
**అలి కర్కియుతే విలగ్నగే**
**సౌరే శీతకరేక్షితేఽ వటే ॥**

**దశాధ్యాయి :**

లగ్నమునకు-చంద్రరాశికి 12న శనియుండి, క్రూరగ్రహములచే చూడబడిన కారాగారమందు లేదా ఏకాంతస్థలమందు ప్రసవమగును.

కర్కాటక-వృశ్చిక లగ్నములలో శనియుండి, చంద్రునిచే చూడబడినచో పవిత్ర స్థలమందుగాని, దేవాలయ సమీపమునందు గాని ప్రసవమగును.





**11. శ్లో॥ మందేఽబ్జగతే విలగ్నగే**
**బుధ సూర్యేందు నిరీక్షితే క్రమాత్ ।**
**క్రీడాభవనే సురాలయే**
**ప్రసవంసోషర భూమిషూద్దిశేత్ ॥**

**దశాధ్యాయి :**

జలరాశి లగ్నమందు శనియుండి రవిచే చూడబడిన-దేవాలయ స్థానము లందు, బుధునిచే చూడబడిన సురతభవనములందు, చంద్రునిచే చూడబడిన ఎడారి భూములందు ప్రసవమగును.

**12. శ్లో॥ నృలగ్నగం ప్రేక్ష్య కుజః శ్మశానే**
**రమ్యే సితేందూ గురురగ్ని హోత్రే ।**
**రవిర్నరేంద్రామర గోకులేషు**
**శిల్ప్యాలయే జ్ఞః ప్రసవంకరోతి ॥**

**దశాధ్యాయి :**

మనుష్యరాశిలగ్నమందు శనియుండి, కుజునిచే చూడబడిన, శ్మశాన మందు, శుక్ర-చంద్రులచే చూడబడిన, అందమైన భవంతులందు, గురునిచే చూడబడిన యాగశాల మొ॥ పవిత్ర స్థలములందు, తత్సమీపములందు, సూర్యుడు చూచిన ప్రభుత్వ భవనములందు, రాజప్రాసాదములందు, బుధుడు చూచిన కళల నిలయమందు ప్రసవమగును.

**13. శ్లో॥ రాశ్యంశ సమాన గోచరే మార్గే**
**జన్మ చరే స్థిరే గృహే ।**
**సర్క్షాంశగతే స్వమందిరే**
**బలయోగాత్ ఫలమంశ కర్క్షయోః ॥**

చంద్రరాశ్యనుసారముగా ప్రసవస్థానమును నిర్ణయించవలయును. చరాది రాశులందు మార్గమున స్థిరరాశులలో స్వగృహమునందు, మిత్రరాశిగత గ్రహముచేత మిత్రగృహములందు, బలయోగానుసారముగా నిర్ణయించ వలయును. అంశను కూడా పరిశీలించవలయును. కేవలం రాశిచేతనే ఫలితము చెప్పరాదు.

**14. శ్లో॥ ఆరార్కజయోస్త్రికోణగే చంద్రే**
**అర్కేచ విసృజ్యతేంబయా ।**
**దృష్టేఽమరరాజ మంత్రిణా**
**దీర్ఘాయు స్సుఖభాక్చసస్మృతః ॥**

**దశాధ్యాయి :**

కుజ-శనులు కలసియుండి, వారికి 9-5 నందు సూర్యుడుగాని, చంద్రుడు గానియున్న తల్లిచేత పరిత్యజించబడినవాడగును. గురుదృష్టియున్న యితరుల పోషణలో దీర్ఘాయువు, సుఖము పొందువాడుఅగును.

**15. శ్లో॥ పాపేక్షితే తుహినగావుదయే కుజేఽస్తే**
**త్యక్తో వినశ్యతి కుజార్కజయోస్తథామ్ ।**
**సౌమ్యేఽభి పశ్యతి తథావిధ హస్తమేతి**
**సౌమ్యేతరేషు పరహస్తగతోఽప్యనాయుః ॥**

**దశాధ్యాయి :**

లగ్నమందు చంద్రుడుండి, కుజ-శనులలో ఒకరిచేత చూడబడి, సప్తమున కుజుడున్న ప్రసవించబడిన శిశువు తల్లిచేత పరిత్యజింపబడి, మరణించును.

లగ్నమందు చంద్రుడు, సూర్యునిచే చూడబడుచూ, లాభస్థానమున కుజ-శనులున్న ప్రసవించబడిన శిశువు తల్లిచేత పరిత్యజింపబడి అనంతరము మరణించును.





శుభులచే చూడబడిన ఆగ్రహసంబంధ జాతివారి చేతులలో పెరుగును.

ఇతర క్రూరగ్రహములచే చూడబడినవారికి లభించునుగాని మరణించును.

**16. శ్లో॥ పితృమాతృగృహేషు తద్బలాత్**
**తరుసాలాదిషు నీచగైశ్శుభైః ।**
**యదినైక గతైస్తు వీక్షితౌ**
**లగ్నేందూ విజనే ప్రసూయతే ॥**

**దశాధ్యాయి :**

పితృకారక-మాతృకారక గ్రహబలానుసారముగా ఆయా గృహములందు ప్రసవము జరుగును.

శుభగ్రహములు నీచయందున్న వృక్షము, వసారా, సమీపములందు ప్రసవమగును.

ఒకేరాశియందు గ్రహములన్నీ ఉండి, లగ్న-చంద్రులు చూడబడనిచో నిర్జన ప్రాంతమునందు ప్రసవమగును.

**17. శ్లో॥ మందర్క్షాంశే శశిని హిబుకే మందదృష్టేఽబ్జగే వా**
**తద్యుక్తే వా తమసి శయనం నీచసంస్థైశ్చ భూమౌ ।**
**యద్వద్రాశిర్వ్రజతి హరిజం గర్భమోక్షస్తు తద్వత్**
**పాపైశ్చంద్రాత్ స్మరసుఖగతైః క్లేశమాహుర్జనన్యాః ॥**

**దశాధ్యాయి :**

చంద్రుడు శని నవాంశలందున్ననూ, చంద్రుడు చతుర్థమునందున్ననూ, చంద్రునకు శని దృష్టియున్ననూ ప్రసవ గృహము చీకటిగానుండును.

చంద్రుడు-శనితో కలసియున్ననూ, కర్కాటక-మీన నవాంశలందున్ననూ అదే ఫలితము.

నీచయందున్న గ్రహములచేత భూమియందు ప్రసవము సంభవించును. ప్రసవలగ్న రాశ్యనుగుణముగా ఫలితముండును.

చంద్రునికి సప్తమరాశినుండి తల్లి క్లేశములు తెలుసుకొనవచ్చును. క్రూర గ్రహములు సప్తమములోనున్న తద్గ్రహానుసారమైన బాధలుండును.

**ఆర్యాసప్తతియందు**

**శ్లో॥ చంద్రే పాపసమేతే భృగుజేవా విగ్రహః సహస్త్రీభిః ।**
**వక్తవ్యం ద్యూనగతైః పాపైః సుఖసంస్థితైస్తద్వత్ ॥**

**18. శ్లో॥ స్నేహశ్శశాంకాదుదయాచ్చ వర్తిః**
**దీపోఽర్కయుక్తర్క్ష వశాచ్చరాద్యైః ।**
**ద్వారంచ తదేద్వాస్తుని కేంద్రసంస్థైః**
**జ్ఞేయంగ్రహైః వీర్య సమన్వితైర్వా ॥**

**దశాధ్యాయి :**

ప్రసవగృహములోని దీపవిషయము. తైలము చంద్రునివలన, వత్తి లగ్నమువలన, దీపస్థితి సూర్యునివలన తెలియును.

ఇచ్చట విశేషమేమనగా తైలము పుణ్యాపాప కర్మలు, వీటికి మనస్సు కారణముకనుక మనస్సుకూ చంద్రకారకత్వము కనుక, చంద్రునివలన సుఖ దుఃఖములు తెలుసుకొనవలెను.

వత్తిదేహము, లగ్నముననుసరించి దేహగుణములు, సూర్యునివలన దీపమువంటి ఆత్మప్రభావాది గుణములు తెలియదగును.

లగ్నకేంద్రమందున్న బలవత్తర గ్రహములననుసరించి ప్రసవగృహ ద్వారమును తెలుసుకొనవచ్చును.





**వశిష్ఠుడు :**

**శ్లో॥ అపృచ్ఛతః పృచ్ఛతోవా జిజ్ఞాసోర్యస్యకస్యచిత్ ।**
**హోరాకేంద్ర త్రికోణేభ్యః తస్యవిద్యాత్ శుభాశుభమ్ ॥**

ప్రశ్నకాలమందు హోర-కేంద్ర-త్రికోణముల ననుసరించి పృచ్ఛకుని విషయములకు ఫలితములు నిర్ణయించవలయును.

ఎవరూ ప్రశ్నించకపోయిననూ జ్యోతిషపండితుడు తనకుగల జిజ్ఞాసవలన తత్కాల గ్రహస్థితిననుసరించి శుభాశుభములను తెలుసుకొనవచ్చును.

**విద్వజ్జనవల్లభమను గ్రంథమందు :**

**శ్లో॥ ఆరోగ్యస్య ప్రాప్తి మర్థస్యలాభం**
**వాదేజైత్యం సంగమంచ ప్రియేణ ।**
**సౌమ్యాః కేంద్రస్థాయినః ఖేచరేంద్రాః**
**కుర్వంత్యన్యే త్వన్యథా సర్వమేతత్ ॥**

శుభులు కేంద్రమందున్నచో ప్రశ్నఫలితము అనుకూలముగా నుండును.

**19. శ్లో॥ జీర్ణం సంస్కృతమర్కజే క్షితిసుతేదగ్ధంనవం శీతగౌ**
**కాష్ఠాఢ్యం నదృఢంరవౌ శశిసుతేచానేకశిల్ప్యుద్భవం-**
**రమ్యంచిత్రయుతన్నవంచభృగుజే జీవే దృఢంమందిరం**
**చక్రస్థైశ్చ యథోపదేశ రచనాన్ సామంతపూర్వాన్ వదేత్ ॥**

**దశాధ్యాయి :**

ప్రసవగృహ మెట్లున్నది?

భోజనగృహమైనా-పడకగది అయినా ఏ గృహమైనా ప్రశ్నయందు తెలుసు కొనుటకూ ఈ క్రింది విషయమువలన నిర్ణయించవచ్చును.

శనివలన బాగుచేసిన పాతఇల్లని-కుజనివలన కొంత కాలినఇల్లని-బుధునివలన అలంకార శోభితమైనదని-చంద్రునివలన కొత్తఇల్లని- సూర్యుని వలన గట్టికర్రలు-చెక్కలతోనిర్మించినదని-శుక్రునివలన నూతన మనోజ్ఞ భవనమని-గురునివలన పురాతన దృఢగృహమని తెలుసుకొన వలయును.

ప్రసవగృహమునకు చుట్టుపక్కఇళ్లను సామంతగృహములందురు.

వీటివిషయములను కూడా ప్రసవగృహ లగ్నము మొదలుకొని 12 రాశుల ను 4భాగములు చేసి వరుసగా తూర్పు-దక్షిణ-పడమర-ఉత్తర దిశల నున్న ఇళ్లనుగూర్చి తెలుసుకొనవచ్చును.

**20. శ్లో॥ మేషకుళీరతులాలిఘటైః**
**ప్రాగుత్తరతో గురుసౌమ్యగృహైశ్చ ।**
**పశ్చిమతశ్చ వృషేణ నివాసో**
**దక్షిణభాగకరౌ మృగసింహౌ ॥**

**దశాధ్యాయి :**

ప్రసవగృహము ఏదిశనున్నదీ తెలియును. మేష-కర్కట-తులా-వృశ్చిక-కుంభములు జన్మలగ్నమైనచో, గృహమున తూర్పుగదియని, ధనుర్మీన కన్యామిధునములలో ఉత్తరమని, వృషభలగ్నమైన పడమటిగదియని, సింహ మకరములవలన దక్షిణగదియని తెలియవలెను.

**21. శ్లో॥ ప్రాచ్యాదిగృహే క్రియాదయో ద్వౌ**
**ద్వౌకోణగతా ద్విమూర్తయః ।**
**శయ్యాస్వపి వాస్తువద్వదేత్**
**పాదాఃషట్త్రి నవాంత్య సంస్థితైః ॥**





**దశధ్యాయి :**

ప్రసవగృహమందు శయ్యాదిశను తెలుపుచున్నాడు. మేష-వృషభముల వలన తూర్పు, మిధున-ఆగ్నేయము, కర్కాటక-సింహములు దక్షిణం, కన్య-నైఋతి, తులా-వృశ్చికములు పశ్చిమము, ధనుస్సు-వాయవ్యము, మకర-కుంభములు ఉత్తరం, మీనం-ఈశాన్యము.

ఒక పలకయందు రాశిచక్రములిఖించి పృచ్ఛకుని స్పృశించమని కోరి, అతడుతాకిన రాశిననుసరించి దానిని ఆరూఢలగ్నముగా ప్రశ్నయందు గ్రహించవచ్చును.

ఆయారాశులందున్న గ్రహములననుసరించి వృక్షాదులను, ఆ గృహ మందున్న ఇతర వస్తుజాతమును కూడా వివరించవచ్చును.

**22. శ్లో॥ చంద్రలగ్నాంతర గతైర్గ్రహైస్స్యురుపసూతికాః ।**
**బహిరంతశ్చ చక్రార్ధే దృశ్యాదృశ్యేఽన్యథాపరే ॥**

**దశాధ్యాయి :**

లగ్నమునుంచి చంద్రరాశిపర్యంతం ఉన్నరాశులలో ఉన్నగ్రహసంఖ్యతో సమానముగా, అంతమంది ప్రసవ సమయమున సమీపమున ఉందురు.

వారివారి స్వరూపములు-ధరించిన ఆభరణములు-వర్ణములు-స్వభావాదు-జాతి మొ॥ ఆయాగ్రహానుసారముగా నుండును.

**సారావళియందు :**

**శ్లో॥ లక్షణరూపవిభూషణ యోగస్తాసాం శుభాశుభైర్యోగాత్ ।**
**క్రూరైర్విరూపదేహ లక్షణహీనాస్సురౌద్రమలినాశ్చ ॥**

దృశ్యార్ధభాగమున ఉన్నగ్రహములు ప్రసవగృహమునకు వెలుపలను, అదృశ్యార్ధభాగమున ఉన్నగ్రహములు లోపలవ్యక్తులను సూచించును.

**23. శ్లో॥ లగ్ననవాంశపతుల్యతనుః స్యాద్వీర్యయుతగ్రహతుల్యతనుర్వా ।**
**చంద్రసమేత నవాంశపవర్ణః కాదివిలగ్న విభక్తభాగాత్రః ॥**

## దశాధ్యాయి :

లగ్నముయొక్క నవాంశననుసరించి శరీరమును గూర్చి తెలుపవలయును. నవాంశాధిపతి శుభుడై బలవంతుడైనచో ఆరోగ్యము-అందము-బలము-చెప్పవలయును.

రాశులజడములు-గ్రహములుశక్తిమంతములు. గ్రహములులేని శూన్య రాశి ఫలమివ్వదు.

## సారావళియందు :

**శ్లో॥ భవనాధిపైః సమస్తంజాతకవిహితం విచింతయేన్మతిమాన్**
**ఏభిర్వినానశక్యం పదమపి గంతుం మహాశాస్త్రే ॥**

ఆస్థానాధిపతి స్వరూప-స్వభావాదులు ఆభావముయొక్క కారకత్వమునకు కలుగును.

ఉదా-పుత్రస్థానము మీనమైనచో మీనరాశి, తదధిపతి అయిన గురునికి ఏ స్వరూప-స్వభావాదులు చెప్పబడినవో అటువంటి పుత్రుడుకలుగును.

పుత్రస్థానము సరిరాశియై దాని అధిపతి స్త్రీగ్రహమై, స్త్రీగ్రహముచే చూడబడిన స్త్రీసంతానము కలుగును.

పుత్రస్థానాధిపతి ఎన్నినవాంశలు పొందెనో, అంతమంది సంతానము కలుగును. బలాబలములు పరిశీలించి చెప్పవలయును.

"కాలాంగానివరానన"అను శ్లోకముననుసరించి ఆయా అవయవ విభాగముల ననుశీలించి శుభాశుభగ్రహ దృష్టియోగానుసారముగా ఫలితము తెలుసుకొనవలయును.





ప్రశ్నయందు రోగవిషయము నిర్ధారించునపుడు పైవిధముగా బలాబలములు బాగుగా విమర్శించవలయును.

**24. శ్లో॥ కంద్రుక్ఛ్రోత్రనసాకపోల హనవో వక్త్రంచహోరాదయః**
**తే కంఠాంసక బాహుపార్శ్వ హృదయక్రోడాని నాభిస్తథా ।**
**వస్తిఃశిశ్నగుదే తతశ్చవృషణావూరూతతోజానునీ**
**జంఘేంఘ్రీత్యుభయత్రవామముదితైః ద్రేక్కాణభాగైస్త్రిధా ॥**

## దశాధ్యాయి :

శరీరమునందు పుట్టుమచ్చలు-వ్రణములు-తెలుపుచున్నాడు.

మూడు ద్రేక్కాణములకు 36 స్థానములు, లగ్నప్రథమ ద్రేక్కాణమునకు 12స్థానములు. ఇవి ప్రథమరాశి శిరస్సు - ద్వితీయరాశి కన్నులు (కుడికన్ను) ద్వాదశరాశి ఎడమకన్ను - తృతీయము కుడిచెవి- ఏకాదశమము ఎడమచెవి- చతుర్థము కుడిముక్కురంధ్రము - దశమము ఎడమముక్కురంధ్రము-పంచమము కుడిబుగ్గ-నవమము ఎడమబుగ్గ-షష్టము కుడిదవడ-అష్టమము ఎడమదవడ.

లగ్నంద్వితీయ ద్రేక్కాణము అయినచో లగ్నము కంఠము-ద్వితీయము కుడిభుజము-ద్వాదశము ఎడమభుజము-తృతీయము కుడిచేయి, ఏకాదశమము ఎడమచేయి-చతుర్థము కుడిప్రక్క-దశమము ఎడమప్రక్క-పంచమము హృదయమునకు కుడిభాగము-నవమము ఎడమభాగము-షష్ఠమము ఉదరం కుడివైపు-అష్టమము ఉదరంఎడమ.

లగ్నము తృతీయ ద్రేక్కాణమయినచో లగ్నము నాభి-ద్వితీయము మర్మాంగము-ద్వాదశం గుదము-తృతీయ ఏకాదశమములు కుడిఎడమ వృషణములు- చతుర్థము కుడితొడ-దశమము ఎడమతొడ-పంచమము కుడిమోకాలు-నవమము ఎడమమోకాలు-షష్ఠమము కుడికాలిపిక్క-అష్టమము ఎడమకాలిపిక్క. సప్తమం పాదములు.

లగ్నము నుంచి సప్తమంవరకు-కుడిభాగం.

అష్టమంనుంచి ద్వాదశంవరకు-ఎడమభాగం ప్రథమద్రేక్కాణం-శిరస్సు నుంచి కంఠంవరకు ద్వితీయద్రేక్కాణం-కంఠం నుండి నాభివరకు తృతీయ ద్రేక్కాణం నాభినుంచి పాదములవరకు.

ప్రశ్నయందు కూడా ఈ విభాగమే అనుసరించవలయును.

**25. శ్లో॥ తస్మిన్పాపయుతే వ్రణశ్శుభయుతే దృష్టేచ లక్ష్మాదిశేత్**
**స్వర్క్షాంశస్థిరసంయుతేచ సహజఃస్యాదన్యథాఽఽగంతుకః।**
**మందేఽశ్మానిలజోఽగ్ని శస్త్రవిషజో భౌమేబుధే భూభవః**
**సూర్యేకాష్ఠచతుష్పదేన హిమగౌ శృంగ్యబ్జజోఽన్యైశ్శుభః ॥**

**దశాధ్యాయి :**

ఏ రాశిపాపగ్రహయుక్తమైనదో, తత్సంబంధ అవయవమున వ్రణములు చెప్పవలయును. ఆ రాశికి శుభగ్రహయుతముగాని, దృష్టిగాని కలిగిన ఆ అవయవమునందు పుట్టుమచ్చను చెప్పవలయును.

స్వరాశి-స్వనవాంశయందు గ్రహముండి అదిస్థిరరాశియైన పుట్టుకతోనే వ్రణములు-పుట్టుమచ్చలు ఉండును. అట్లులేనిచో తదనంతర కాలములో వచ్చును.

శనివలన రాళ్లు-వాతముచేత-కుజునివలన అగ్ని-శస్త్ర-విషములవలన-పాపయుత బుధుడైనచో కింద భూమిపై పడుటవలన- సూర్యుడైనచో కర్రలవలన-జంతువులవలన-క్షీణచంద్రుడైనచో జలచర జంతువులవలన-వ్రణములు-పుట్టుమచ్చలు కలుగును.

**26. శ్లో॥ సమనుపతితా యస్మిన్గాత్రే త్రయస్సబుధాగ్రహా**
**భవతి నియమాత్తస్యావాప్తిః శుభేష్వశుభేషువా ।**
**వ్రణకృదశుభః షష్ఠే లగ్నాత్తనౌ భసమాశ్రితే**
**తిలకమషకృద్దృష్టః సౌమ్యైర్యుతశ్చ స లక్ష్మవాన్ ॥**





**దశాధ్యాయి :**

ఏరాశియందు బుధునితో కలసి మూడు గ్రహములుండునో అచట బలాధిక్య గ్రహమునననుసరించి ఆ గ్రహదశయందు ఆగ్రహమున్నరాశియొక్క అవయవ మందు వ్రణము లేదా చిహ్నము కలుగచేయును. శుభగ్రహ సంబంధమున్నచో నలుపు-తెలుపు మచ్చలు కలుగును.

**కృష్ణీయమందు :**

**శ్లో॥ క్రూరే షష్ఠే లగ్నాత్ స్వాంగవిభాగే కరోతివైకల్యం ।**
**కేంద్రత్రికోణరాశిషునస్యుః గురుసౌమ్య భృగుపుత్రాః ॥**

**ఇతి గోవింద సోమయాజికృతౌ బృహజ్జాతక**
**వ్యాఖ్యాయాం దశాధ్యాఖ్యాయ్యాఖ్యాయాం**
**పంచమాధ్యాయః**

★★★

## షష్ఠాధ్యాయః

## అరిష్టాధ్యాయః

**శ్లో॥ సంధ్యాయాం హిమదీధితి హోరా**
**పాపైర్భాంత గతైర్నిధనాయ ।**
**ప్రత్యేకం శశిపాపసమేతైః**
**కేంద్రైర్వా స వినాశముపైతి ॥**

**దశాధ్యాయి :**

అరిష్టయోగములు చెప్పుచున్నాడు. ఇవి 12సం॥లలోపు సంభవించును. వీటికి దశలతో సంబంధము లేదు. అనంతరము 32సం॥ వరకు యోగారిష్టము. 70సం॥ల వరకు మధ్యమాయువు. 100సం॥ వరకు దీర్ఘాయువు.

సంధ్యాకాలము చంద్రహోరయు, పాపగ్రహములు అంత్యనవాంశ పొందిన జన్మించిన శిశువు జీవించదు.

మూడు కేంద్రములందు పాపాగ్రహములు మిగిలిన కేంద్రమున చంద్రుడు ఉండిన అరిష్టము కలుగును.

**సంహితయందు :**

**శ్లో॥ అన్యజన్మాంతరకృతంకర్మ పుంసాం శుభాశుభం ।**
**యత్తస్యశకునం పాకం నివేదయతి పృచ్ఛతామ్ ॥**

**అన్యత్ర :**

**శ్లో॥ పాపైర్లగ్నోపగతైః శరీరపీడాం వినిర్దిశేత్ కలహం**
**సుఖసంస్థైః సుఖనాశం గృహభేదం బంధు విగ్రహంచవదేత్**
**అస్తేగమన విరోధః కర్మస్థైః కర్మణాపమపి వినాశః॥**

**2. శ్లో॥ చక్రస్యపూర్వేతర భాగగేష క్రూరేషు సౌమ్యేషుచ కీటలగ్నే।**
**క్షిప్రం వినాశం సముపైతి జాతః పాపైర్విలగ్నాస్తమయాభితశ్చ॥**

**దశాధ్యాయి :**

వృశ్చిక-కర్కాటక లగ్నమందు జననమై రాశిచక్ర పూర్వభాగములో (10-11-12-1-2-3) పాపగ్రహములుండి, ఉత్తరార్ధభాగములో శుభ గ్రహములున్న జన్మించిన శిశువు వెంటనే మరణించును.

**3. శ్లో॥ భౌమేవిలగ్నే శుభదైరదృష్టే షష్ఠేఽ ష్టమే వార్కసుతేనయుక్తే।**
**తౌచార్కసంస్థేశుభదృష్టిహీనౌజాతస్యసద్యః కురుతఃప్రణాశమ్॥**

**దశాధ్యాయి :**

కుజుడు నవాంశలగ్నములో శనితో కలసియుండి-6-8లో ఉండి శుభులచే చూడబడనిచో శిశువునకు సద్యోమరణము నిచ్చును. సింహరాశి యందుపైన తెలిపిన విధముగా నున్ననూ అదేఫలితము సంభవించును.





**4. శ్లో॥ పాపావుదయాస్తగతౌ క్రూరేణ యుతశ్చ శశీ।**
**దృష్టస్తు శుభైర్నయదా మృత్యుశ్చ భవేదచిరాత్॥**

**దశాధ్యాయి :**

లగ్న సప్తమములందు పాపగ్రహములుండి, చంద్రుడు పాపయుతుడై శుభదృష్టిలేని వాడైనచో అచిరకాలమందే అరిష్టము కలుగును.

**5. శ్లో॥ క్షీణేహిమగౌ వ్యయగే పాపైరుదయాష్టమగైః ।**
**కేంద్రేషు శుభాశ్చనచేత్క్షిప్రం నిధనంప్రవదేత్ ॥**

**దశాధ్యాయి :**

ద్వాదశమందు క్షీణచంద్రుడుండి-లగ్నాష్టమములందు పాపగ్రహము లుండి-కేంద్రములందు శుభగ్రహములు లేనిచోవెంటనే మరణముకలుగును.

**6. శ్లో॥ క్రూరసంయుతశ్శశీ స్మరాంత్య మృత్యులగ్నగః।**
**కంటకాత్ బహిశ్శుభైరవీక్షితశ్చ మృత్యుదః॥**

**దశాధ్యాయి :**

చంద్రుడు-1-7-8-12 స్థానములలో పాపగ్రహములతో కలసియుండి, కేంద్రేతర స్థానములందుండు శుభగ్రహములు చూచేనేని అరిష్టము కలుగును.

**7. శ్లో॥ శశిన్యరి వినాశగే నిధనమాశు పాపేక్షితే**
**శుభైరథ సమాష్టకం దలమతశ్చ మిశ్రైః స్థితిః ।**
**అసద్భిరవలోకితే బలిభిరత్ర మాసంశుభే**
**కళత్ర సహితేచ పాపవిజితే విలగ్నాధిపే ॥**

**దశాధ్యాయి :**

చంద్రుడు 6-8లో ఉండి, పాపులచే చూడబడిన సద్యోమరణము-శుభులచే చూడబడిన 8సం॥లు జీవించును. శుభ-పాప గ్రహముల రెండింటిచే చూడ బడిన 4సం॥లు జీవించును.

వక్రించిన గ్రహములచే చూడబడిన 1నెల జీవించును.

లగ్నాధిపతి సప్తమాధిపతితో కలసి పాపులచే చూడబడిన 1నెల జీవించును.

**8. శ్లో॥ లగ్నేక్షీణే శశిని నిధనం రంధ్రకేంద్రేషు పాపైః**
**పాపాంతస్థే నిధనహిబుక ద్యూనయుక్తే చకేంద్రే ।**
**ఏవం లగ్నేభవతి మదనచ్ఛిద్రసంస్థైశ్చ పాపైః**
**మాత్రాసార్ధం యదినచ శుభైః వీక్షితః శక్తిమద్భిః ॥**

## దశాధ్యాయి :

లగ్నమున క్షీణచంద్రుడు, అష్టమం, కేంద్ర స్థానములందు పాప గ్రహములున్నచో సద్యోమరణం.

4-7-8 స్థానములలో చంద్రుడు, పాపగ్రహమధ్యగతుడైనచో అరిష్టము కలుగును.

లగ్నమందు చంద్రుడు, 7-2-12 నందు పాపులు, బలవంతులైన శుభులచే చూడబడని ఎడల మాతాశిశువులిరువురూ మరణింతురు.

**9. శ్లో॥ రాశ్యంతగే సద్భిరవీక్ష్యమాణే చంద్రేత్రికోణోపగతైశ్చ పాపైః।**
**ప్రాణైః ప్రయత్యాశు శిశుర్వియోగం అస్తే తు పాపైస్తు**
**హినాంశులగ్నే॥**

## దశాధ్యాయి :

చంద్రుడు అంత్యనవాంశనుపొంది శుభులచే చూడబడక, 5-9లో పాప గ్రహములున్నచో శిశువు సద్యోమరణము పొందును.

చంద్రుడు లగ్నమందుండి, సప్తమమందు పాపగ్రహమున్న శిశువు మరణించును.





## త్రికోణమందు పాపులనుగూర్చి :

**శ్లో॥ త్రికోణస్థేషు పాపేషు కుష్ఠం శూలం మతిభ్రమః ।**
**స్థానభ్రంశః కులభ్రంశో వంశచ్ఛేదోఽధవాభవేత్ ॥**

**10. శ్లో॥ అశుభ సహితేఽగ్రస్తే చంద్రేకుజే నిధనాశ్రితే**
**జననిసుతయోః మృత్యులగ్నే రవౌతుసశస్త్రజః ।**
**ఉదయతి రవౌ శీతాంశౌవా త్రికోణవినాశగైః**
**నిధనమశుభైః వీర్యోపేతైశ్శుభైరయుతేక్షితే ॥**

## దశాధ్యాయి :

చంద్రుడు, శని-రాహువులతో కలసి లగ్నమందుండి, అష్టమమందు కుజుడున్న మాతా-శిశువులకు మరణము కలుగును.

సూర్యుడు, శని-రాహువులు, లేదా బుధునితో కలసి లగ్నమందుండి, అష్టమమందు కుజుడున్న ఎడల ఆపరేషన్ (శస్త్ర-చికిత్స) యందు మరణింతురు.

లగ్నమందు సూర్యుడుగాని, చంద్రుడుగానియుండి, 5-9లో పాపులుండి, అష్టమమందు పాపులు, శుభగ్రహ దృష్టిలేకున్న మరణము సంభవించును.

## విద్వజ్జనవల్ల భమను గ్రంథమందు :

**శ్లో॥ కేంద్రత్రికోణోపగతైః శుభాఖ్యైః పాపేషు కేంద్రాష్టమ వర్జితేషు।**
**బ్రూయాన్నరాణామఖిలార్థసిద్ధిం విపర్యయస్స్యాత్పునరన్యథాస్థైః॥**

**11.శ్లో॥ అసితరవి శశాంకభూమిజైః వ్యయనవమోదయ నైధనాశ్రితైః ।**
**భవతిమరణమాశుదేహినాం యదిబలినాగురుణా న వీక్షితా ః॥**

## దశాధ్యాయి :

శని-రవి-చంద్ర-కుజులు, 12-9-1-8 స్థానములందుండి, బలవంతు డైన గురుదృష్టిలేనిచో పుట్టిన శిశువుగాని, సోదర-బంధువులుగాని మరణింతురు.

**గురుదృష్టి ఉన్నచో అరిష్టయోగము విఫలమగును. శుభదృష్టులలో గురుదృష్టికే ఆధిక్యత కలదు. వక్రించని గురుని సప్తమదృష్టి బలమైనది.**

**12. శ్లో॥ సుతమదన నవాంత్య లగ్నరంధ్రేషు**
**అశుభయుతో మరణాయ శీతరశ్మిః ।**
**భృగుసుతశశిపుత్ర దేవపూజ్యైః**
**యదిబలిభిర్నయుతోఽవలోకితోవా ॥**

**దశాధ్యాయి :**

పాపులతో కలసిన చంద్రుడు-5-7-9-12-1-8 స్థానములందుండి, బుధ-గురు-శుక్రులతో చూడబడినచో శిశువు మరణించును.

ఇవియే సారభూతములైన అరిష్టయోగములు. దోషహరణము- శుభ వర్ధనమునందు గురునకే బలాధిక్యము కలదు. గురునితో కలియుట-గురుదృష్టి-శిశువును రక్షించును.

3-6-11 స్థానములందు పాపులు, కేంద్రములందు శుభులు ఉన్నచో 80 సం॥లు జీవించును. మిశ్రమముగానున్న 60 సం॥లు జీవించును.

**శ్లో॥ త్రిషడేకాదశ సంస్థైః పాపైః సేమ్యైః కేంద్రాశ్రితైరశీత్యబ్దం ।**
**జీవతితత్రోద్భూతూ మిశ్రైర్వా షష్టివర్షంతు ॥**

**శ్లో॥ గురుచంద్రే హిబుకస్థౌ లగ్నేశేలాభగేబలాఢ్యే చ ।**
**సౌమ్యే దశమంయాతే త్వశీతి వర్షంచ పరమాయుః ॥**

గురుచంద్రులు చతుర్థములతో, లగ్నాధిపతి లాభములో, శుభులు దశమములో ఉన్న 80 సం॥ జీవించును.

ఆయుర్నిర్ణయములో చంద్రరాశి-లగ్నము-లగ్ననవాంశ ప్రాధాన్యము వహించును.





లగ్నాధిపతి బలాఢ్యుడై-శుభులతో కలసి లేదా చూడబడి, పాపగ్రహదృష్టి లేనివాడైనచో శుభఫలములనిచ్చును.

**శ్లో॥ కేంద్రత్రికోణ నిధనేషున యస్యపాపాః**
**లగ్నాధిపస్సురగురుశ్చ చతుష్టయస్థౌ ।**
**భుక్త్వాసుఖాని వివిధాని సుపుణ్యకర్మా**
**జీవేచ్చ వత్సరశతం స విముక్తరోగః ॥**

కేంద్ర-త్రికోణ-అష్టమములందు పాపులు లేకుండా, లగ్నాధిపతి-గురుడు- చతుర్థమందున్నచో జాతకుడు పుణ్యకర్ముడై, వివిధ సుఖము లనుభవించి రోగరహితుడై నూరుసం॥లు జీవించును.

**13. శ్లో॥ యోగేస్థానం గతవతి బలినః చంద్రేస్వంవా తనుగృహమథవా।**
**పాపైర్దృష్టే బలవతి మరణం వర్షస్యాంతః కిలమునిగదితమ్॥**

**దశాధ్యాయి :**

అరిష్టయోగమును కలిగించు గ్రహముయొక్కరాశిని, చంద్రుడు గోచార వశమున సంచరించు కాలముగాని, జన్మరాశినిగాని సంచరించునపుడు పాపగ్రహ దృష్టియున్నచో శిశువునకు మరణకాలముగా గ్రహించవలయును.

**శ్లో॥ కాలేనయావతా గచ్ఛేచ్ఛుభః పాపోఽపి వాగ్రహః ।**
**లగ్నంస్వోచ్చం స్వగేహం వా తస్మిన్‌కాలే ఫలంభవేత్ ॥**

**ఇతి గోవిందసోమయాజి కృతౌ బృహజ్జాతక**
**వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యా ఖ్యాయాం**
**షష్ఠాధ్యాయః**

★★★

# సప్తమాధ్యాయః

# ఆయుర్దాయాధ్యాయః

**1. శ్లో॥ మయయవనమణిత్థ శక్తి పూర్వైః**
**దివసకరాదిషు వత్సరాః ప్రదిష్టాః ।**
**నవతిథి విషయాశ్వి భూతరుద్రాః**
**దశసహితా దశభిః స్వతుంగభేషు ॥**

**దశాధ్యాయి :**

మయ-యవన-మణిత్థ-పరాశరులు, గ్రహములు పరమోచ్చ యందు న్నప్పుడు వారిచ్చు ఆయువును ఇట్లు తెలిపియున్నారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్యుడు | - | 19సం॥లు | గురుడు | - | 12సం॥లు |
| చంద్రుడు | - | 25సం॥లు | శుక్రుడు | - | 21సం॥లు |
| కుజుడు | - | 15సం॥లు | శని | - | 20సం॥లు |
| బుధుడు | - | 12సం॥లు | మొత్తం | - | 127సం॥లు |

ఇవి త్రైరాశిక గణనచేత ఆయువును సాధించవలయును.

**2. శ్లో॥ నీచేఽతోఽర్ధం హ్రసతిహి తతశ్చాంతరస్థేఽనుపాతః**
**హోరాత్వంశ ప్రతిమమపరే రాశితుల్యం వదంతి ।**
**హిత్వావక్రం రిపుగృహగతైః హీయతే స్వత్రిభాగః**
**సూర్యోచ్ఛిన్న ద్యుతిషుచదలం ప్రోష్యశుక్రార్కపుత్రౌ ॥**

**దశాధ్యాయి :**

గ్రహములు పరమనీచయందున్న ముందుచెప్పిన సం॥లలో సగము హరించును.





లగ్నాధిపతి బలవంతుడైన లగ్నాదిగానూ, లగ్ననవాంశాధిపతి బల వంతుడైన లగ్ననవాంశాదిగాను లగ్నాయువు లెక్కించవలెను.

గ్రహము వక్రించిచో దానిని శోధించరాదు. శతృక్షేత్రమందున్నచో మూడవవంతు హరించవవలెను.

కుజుడు శతృక్షేత్రగతుడైనా హరించనవసరములేదు. శుక్ర-శనులు తప్ప మిగిలిన గ్రహములు సూర్యునితో కలసిన సగభాగము హరించవలెను.

**3. శ్లో॥ సర్వార్ధ త్రిచరణ పంచ షష్ఠభాగాః**
**క్షీయంతే వ్యయభవనాదసత్సు వామం ।**
**సత్స్వర్ధం హ్రసతి తతస్థ్దైకగా నాం**
**ఏకోంశం హరతి బలీ తథాహ సత్యః ॥**

**దశాధ్యాయి :**

లగ్నమునకు 12లో పాపగ్రహమున్న ఆగ్రహముయొక్క ఆయువు పూర్తిగా హరించును.

11లో పాపగ్రహమున్న సగభాగము హరించును. 10లో-మూడవ భాగము, 9లో-నాల్గవభాగము, 8లో-అయిదవభాగము, 7లో-ఆరవభాగము ఆయువు హరించును.

ఒకేరాశిలో ఎక్కువగ్రహములున్న, ఎక్కువసం॥లు హరించు గ్రహమునే శోధించవలయును. అన్ని గ్రహములనూ హరించపనిలేదు.

**4. శ్లో॥ సార్ధోదితోదిత నవాంశ హతాత్సమస్తాద్**
**భాగోష్టయుక్త శతసంఖ్యముపైతినాశం ।**
**క్రూరేవిలగ్నసహతే విధినాత్వనేన**
**సౌమ్యేక్షితే దలయతః ప్రలయంప్రయాతి ॥**

**దశాధ్యాయి :**

ఒకరాశికి 9పాదముల చో॥న, 12రాశులకు 108పాదములు, ఇవే 108 నవాంశలనబడును.

లగ్నమున సూర్య-కుజ-శనులలో ఏగ్రహమున్నా వారిచ్చు ఆయువు పూర్తిగా హరించవలయును.

లగ్నపాపగ్రహమును, శుభగ్రహము చూచినచో, నవాంశరీత్యా వచ్చిన ఆయువులో సగము హరించును.

**5. శ్లో॥ సమాష్షష్టిః ద్విఘ్నామనుజకరిణాం పంచనిశాః**
**హయానాంద్వాత్రింశత్ ఖరకరభయోః పంచకకృతిః।**
**విరూపాసాత్వాయుః వృషమహిషయో ద్వాదశశునాం**
**స్మృతం ఛాగాదీనాం దశక సహితాః షట్చపరమమ్॥**

**దశాధ్యాయి :**

మనుష్యులకు-ఏనుగులకు పరమాయుర్దాయము 120సం॥ల 5రోజులు. గుర్రములకు 32సం॥లు, గాడిదలు, ఒంటెలు, మొ॥ 25సం॥లు, ఆవులకు గెదెలకు 24సం॥లు, కుక్కలకు 12సం॥లు, పులి॥పిల్లి మొ॥ 12సం॥లు.

జంతువుల జన్మసమయమునుబట్టి వాటి ఆయువును గణించవచ్చును.

ఉదా-ఒక గుర్రము జన్మించిన సమయములో చంద్రుడు ఉచ్చలో ఉండగా దాని ఆయువు ఇట్లు గణించవలయును.

గుర్రంఆయువు = $\dfrac{\text{చంద్రునిపరమోచ్చ సం॥} \times \text{గుర్రంపరమాయు}}{\text{మానవపరమాయువు}}$

$\dfrac{25\times32}{120}$ $\dfrac{800}{120}$ = 6సం॥8నెలలు





**6. శ్లో॥ అనిమిష పరమాంశకే విలగ్నే**
**శశితనయే గవి పంచవర్గలిప్తే।**
**భవతి హి పరమాయుషః ప్రమాణం**
**యది సహితాస్సకలాః స్వతుంగభేషు ॥**

**దశాధ్యాయి :**

లగ్నము మీనాంత్య నవాంశయై బుధుడు వృషభమందు 25లిప్తలలో ఉండగా మిగిలిన గ్రహములు అన్నీ ఉచ్చయందుండగా-జన్మించిన జాతకుడు 120 సం॥ 5రో॥ జీవించును.

ఈ శ్లోకవృత్తము ఇంద్రవజ్రచ్ఛందస్సు. ఈ యోగమునందు జన్మించిన జాతకుడు ఇంద్రునివలె గొప్పవాడగునని సూచించుచున్నది.

వృషభరాశిలో 25 లిప్తల బుధుడున్నచో, రవికి మేషంలో 10భాగల పర మోచ్చస్థితి అసంభవం అని కొందరు చెప్పుచున్నారు. కాని అది నిజముకాదు ఎందుచేతననగా అటువంటి గ్రహస్థితి ఊర్ధ్వాక్షాంశములయందు సంభవించు అవకాశమున్నది.

**7. శ్లో॥ ఆయుర్దాయం విష్ణుగుప్తో஽పి చైవం**
**దేవస్వామీ సిద్ధసేనశ్చ చక్రే।**
**దోషశ్చైషాం జాయతే஽ష్టావరిష్టం**
**హిత్వా నాయుర్వింశతేఃస్యాదధస్తాత్ ॥**

**దశాధ్యాయి :**

ఆయుర్దాయమును గూర్చి విష్ణుగుప్తుడు-సిద్ధసేనుడు- మొ॥వారు చెప్పి యున్నారు. కాని వీరి గణితరీత్యా 8సం॥లు దాటి - 20సం॥లు లోపు మరణము సంభవించదు. అందుచేత వీరి గణితము గ్రాహ్యముకాదు.

8. శ్లో॥ యస్మిన్యోగే పూర్ణమాయుః ప్రదిష్టం
తస్మిన్ప్రోక్తం చక్రవర్తిత్వమన్యత్ ।
ప్రత్యక్షోఽయం తేషుదోషోఽపరోఽపి
జీవత్యాయుః పూర్ణమర్థైర్వినాపి ॥

**దశాధ్యాయి :**

పూర్వము చెప్పబడిన యోగము పూర్ణాయుర్దాయమును సూచించగా, కొందరు చక్రవర్తియోగము కలిగించునని చెప్పారు.

6గ్రహములు పరమోచ్చగతములయిన జాతకుడు భూమినేలును. అయితే ముఖ్యముగా పూర్ణాయువునే చెప్పవలయును. ఈయోగముపట్టినచో దరిద్రుడు కూడా పూర్ణాయువుగా జీవించును. ఇది ప్రత్యక్షముగా కనబడుచున్నది.

9. శ్లో॥ స్వమతేన కిలాహ జీవశర్మా
గ్రహదాయం పరమాయుష స్స్వరాంశం
గ్రహభుక్తరాశి నవాంశ తుల్యం
బహుసామ్యం సముపైతి సత్యవాక్యమ్ ॥

**దశాధ్యాయి :**

జీవశర్మ తనసిద్ధాంతరీత్యా ఆయుఃప్రమాణము 120సం॥5రో, గ్రహముల ఉచ్చాదిస్థితి ననుసరించి యుండునని తెలిపెను.

సత్యాచార్య సిద్ధాంతరీత్యా, గ్రహము ఏనవాంశయందుండునో ఆరాశి మేషాదిగా ఎన్నవ నవాంశఅగునో అన్ని సం॥లు ఆయువు ఆగ్రహమిచ్చినదిగా గ్రహించవలయును. అయితే ఈవిధముగా గణించినచో ప్రతీగ్రహమునకు 9సం॥లు కంటే అధికమురాదు. ఇది కుదరదు.

కనుక మేషాదిగా రాశిగత నవాంశలను పరిగణనలోనికి తీసుకొనవలయును.





10. శ్లో॥ స్వతుంగవక్రోపగతైః త్రిసంగుణం
ద్విరుత్తమఃస్వాంశ గృహత్రిభాగగైః ।
ఇయాన్ విశేషస్తు భదత్త భాషితే
సమానమన్యత్ ప్రథమేష్వుదీరితమ్ ॥

**దశాధ్యాయి :**

సత్యాచార్య సిద్ధాంతరీత్యా, ఉచ్చగ్రహము-వక్రించినగ్రహము ఇచ్చిన ఆయువు మూడురెట్లు చేయవలయును. దీనిని భరణమందురు.

వర్గోత్తమాంశయందు-స్వనవాంశయందు ఉన్న గ్రహమిచ్చినఆయువు రెండురెట్లు చేయవలయును.

స్వక్షేత్రమందు-స్వద్రేక్కాణమందు ఉన్నగ్రహమిచ్చిన ఆయువు రెట్టింపు చేయవలయును.

ఇక హరణాదులు పూర్వము చెప్పినట్లుగానే చేయవలయును.

ఈ క్రిందిశ్లోకము "బృహజ్జాతకము" భట్టోత్పలవ్యాఖ్యలో నున్నది. దశాధ్యాయి వ్యాఖ్యయందు లేదు. అయిననూ ఇది సత్యాచార్య ఆయుర్గణిత విధానము సూచించుచున్నది కనుక శ్లోకము-దాని తాత్పర్యము వ్రాయుచున్నాము.

శ్లో॥ సత్యోక్తే గ్రహమిష్టం లిప్తీకృత్వా శతద్వయేనాప్తం ।
మండలభాగ విశుద్ధేః అబ్దాః స్యుః శేషాత్తు మాసాద్యాః ॥

**తాత్పర్యము :**

రాశిలో గ్రహము ఎన్నిభాగలలో ఉన్నదో, దానిని లిప్తలుగా మార్చి 200చేత భాగించగా సంవత్సరములు వచ్చును.

శేషమును 12చేత గుణించి, మరల 200చేత భాగించగా మాసములు వచ్చును.

శేషమును 30చేత గుణించి, మరల 200చేత భాగించగా దినములు వచ్చును.

ఇదే సత్యాచార్య ఆయుర్గణిత విధానము. దీనిని సులభముగా సాధించుటకు "జ్యోతిష విద్యానిధి" అనుగ్రంథములో ఒక పట్టిక ఇచ్చియున్నాము పరిశీలించగలరు.

**11. శ్లో॥ కింత్వత్ర ప్రతిమం దదాతి**
**వీర్యాన్వితా రాశి సమంచహోరా ।**
**క్రూరోదయేచాపచయస్సనాత్ర**
**కార్యంచనాథైః ప్రథమోపదిష్టైః ॥**

**దశాధ్యాయి :**

లగ్నాయుర్దాయ విషయములో, లగ్నము మేషమునుంచి ఎన్నవదగునో, అన్ని సంవత్సరములు ఆయువుగా గ్రహించవలయును.

లగ్నము ఎన్నివ నవాంశయందుండనో నవాంశ లగ్నస్ఫుటమును లిప్తలుగా మార్చి 12చేత గుణించి 1800చేత భాగించగా మాసములు వచ్చును.

శేషమును 30చేత గుణించి, మరల 1800చేత భాగించగా దినములు వచ్చును.

సత్యాచార్య ఉపదేశమున విశేషమేమనగా లగ్నమున పాపగ్రహములున్నచో మయుడు మొ॥వారు తెలిపిన క్రూరోదయ హరణము చేయనవసరములేదు.

**12. శ్లో॥ సత్యోపదేశః ప్రవరోఽత్ర కింతు**
**కుర్వంత్యయోగ్యం బహువర్గణా భిః ।**





**ఆచార్యకం త్వత్ర బహుఘ్నతాయాం**
**ఏకంతుయద్భూరి తదేవ కార్యమ్ ॥**

**దశాధ్యాయి :**

ఒక గ్రహమునకు అనేక భరణములు వచ్చిన ఏది ఎక్కువ సం॥ల నిచ్చునో దానిని మాత్రమే గ్రహించవలయును. అదేవిధముగా ఒక గ్రహమునకు అనేక హరణములు ప్రాప్తించినపుడు అధికమైనది ఒకదానినే గ్రహించవలెను.

**13. శ్లో॥ గురుశశిసహితే కుళీరలగ్నే**
**భృగుతనయే శశిజేచ కేంద్రయాతే ।**
**భవరిపు సహజోపగైశ్చ శేషైః**
**అమితమిహాయురను క్రమాద్వినా స్యాత్ ॥**

**దశాధ్యాయి :**

120 సం॥లు, దాటి జీవించు ఒకఅమితాయుర్దాయ యోగమును తెలుపుచున్నాడు.

కర్కాటక లగ్నమందు గురుచంద్రులుండి, కేంద్రమున శుక్రశనులుండి, 3-6-11 స్థానములందు మిగిలిన గ్రహములున్నచో 120సం॥ 5రోజులు దాటి జీవించును.

గురుడు లగ్నమందుండుటను గూర్చి శ్లో॥ బలిష్ఠో లగ్నగః సూరిః సర్వారిష్ట వినాశకృత్॥ అని చెప్పబడినది.

కేంద్రమందు శుభులు-3-6-11 స్థానములందు పాపులు ఆయుర్దాయమునకు మంచిది.

**ఇతి గోవింద సోమయాజి కృతౌ బృహజ్జాతక**
**వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం**
**సప్తమాధ్యాయః**

★★★

# అష్టమోఽధ్యాయః

# దశాంతర్దశాధ్యాయః

1. శ్లో॥ ఉదయరవి శశాంక ప్రాణికేంద్రాది సంస్థాః
ప్రథమ వయసి మధ్యేఽంత్యే చదద్యుః ఫలాని ।
నహినఫల విపాకః కేంద్రసంస్థాద్యభావే
భవతి హి ఫలపక్తిః పూర్వమాపోక్లిమేఽపి ॥

## దశాధ్యాయి :

ఈ అధ్యాయమంతయూ ప్రశ్నశాస్త్రమందూ ఎంతో ఉపయోగించును.

లగ్న-సూర్య-చంద్రులలో ఎవరు బలవంతులో వారి దశమొదట జరుగును. ఆ గ్రహ దశాధిపతికి కేంద్రములందున్న గ్రహముల దశ ప్రథమ వయసులో దశాఫలము నిచ్చును.

పణపరములందున్న గ్రహముల దశ మధ్యవయసులోనూ, ఆపోక్లేమము లందున్న గ్రహములు అంతమవయసునందు తమ దశాఫలితముల నిచ్చును.

మానవజీవిత పరమాయువును 3భాగములు చేసి, మొదటి 40సం॥లు లగ్నమునుంచి ఫలనిర్దేశము చేయవలయును. మధ్యవయసునందు 40-80 చంద్రరాశినుంచి, అంత్యభాగము 80-120 సూర్యరాశి నుంచి ఫలనిర్దేశము చేయవలయును.

కేంద్రములందు బహుగ్రహములున్నచో ముందుగా లగ్నమందు-తరువాత చతుర్థమందు-సప్తమ-దశమములందున్న గ్రహదశలు పరిశీలించవలెను.

కేంద్రములందు గ్రహములు లేనిచో పణపరమందున్న గ్రహదశలు గ్రహించవలయును.





2. శ్లో॥ ఆయుఃకృతంయేన హి యత్తదేవ
కల్ప్యాదశా సా ప్రబలస్య పూర్వా ।
సామ్యేబహూనాం బహువర్షదస్య
తేషాంచ సామ్యే ప్రథమోదితస్య ॥

## దశాధ్యాయి :

జాతక విషయమందైనా-ప్రశ్నవిషయమందైనా ముందుగా ఆయువు ఆలోచించవలయును. అరిష్ట యోగములు-రాజయోగములు-దశలు పరిశీలించ వలెను.

శ్లో॥ జన్మలగ్నతయా ప్రశ్నలగ్నం సంకల్ప్య పండితః ।
జాతకేయద్యదుద్దిష్టం తత్తత్ ప్రశ్నేఽపి చింతయేత్ ॥

గ్రహముయొక్క శుద్ధ ఆయుర్దాయ మెంతయుండునో అది ఆగ్రహ దశాసం॥లుగా గ్రహించవలయును.

లగ్న-సూర్య-చంద్రులలో బలవంతుని దశ మెదట ప్రారంభమగును.

కేంద్రములలో బహుగ్రహములున్న ఎక్కువ సం॥లు ఆయువునిచ్చు గ్రహదశను రెండవదశగా గ్రహించవలయును.

గ్రహబలముల విషయములో “సప్తఅవస్థలను కూడా పరిశీలించ వలయును.

శ్లో॥ అతిబాలః సమర్క్షస్థో బాలో బంధుగృహేస్థితః
కుమారః స్వగృహస్థః స్యాత్ స్వత్రికోణే యువాభవేత్ ।
ఉచ్ఛస్థానగతో రాజా వృద్ధశ్శతృగృహే స్థితః
మృతానామతి నీచస్థో దశైవం స్థానతో భవేత్ ।
సూర్యాదుదిత మాత్రోఽసావతి బాలః ప్రకీర్తితః

**బాలః సప్తాంశకాదూర్ధ్వం కుమారస్తుతతఃపరం ।**
**వక్రారంభేయువాప్రోక్తో వక్రకాలే నరాధిపః**
**ఆసన్నాస్తమయో వృద్ధో మృతోస్తంగత ఈరితః ।**
**అతిబాలదశాకాలే జడోరోదన తత్పరః**
**బాలస్యతు దశాకాలే క్రీడాసక్తః ప్రహర్షితః ।**
**కుమారస్యదశాకాలే విద్యాసక్తశ్చరేన్నరః**
**యౌవనస్థ దశాకాలే కామీ భోగపరాయణః ।**
**వృద్ధ సంజ్ఞదశాకాలే బలహీనో జడాత్మకః**
**మృతగ్రహ దశాకాలే మరణం యాతి నిశ్చయాత్ ।**

| | | | |
|---|---|---|---|
| అతిబాలావస్థ | - స్వరాశిలో | - లగ్నస్థితి | |
| బాలుడు | - మిత్రక్షేత్రం | - 7డిగ్రీలుదాటి | - క్రీడాసక్తి |
| కుమారుడు | - స్వగృహం | - 10డిగ్రీలుదాటి | - విద్య |
| యువకుడు | - త్రికోణస్థితి | - వక్రారంభకాలం | - భోగం |
| రాజా | - ఉచ్చస్థితి | - వక్రస్థితి | - సుఖం |
| వృద్ధుడు | - శతృగృహం | - అస్తంగతసమీపం | - రోగం |
| మృతుడు | - అతినీచస్థితి | - అస్తగతం | - మరణం |

**3. శ్లో॥ ఏకర్క్షగోఽర్ధ మపహృత్య దదాతి తు స్వం**
**త్ర్యంశం త్రికోణ గృహగః స్మరగః స్వరాశం ।**
**పాదం ఫలస్య చతురస్రగతః సహోరాః**
**త్వేవం పరస్పర గతాః పరిపాచయంతి ॥**

## దశాధ్యాయి :

ఒకేరాశిలో రెండు గ్రహములున్నచో, ఆ రెండు గ్రహ ఫలితములను వాటిలో ఒక గ్రహమే ఇచ్చును.





దశానాధునితో కలసియున్న గ్రహము ఆదశలో సగభాగ సం॥లో తన దశాఫలము నిచ్చును.

దశానాధునికి కోణములందున్న గ్రహము మూడవ భాగములో తన ఫలితములను, సప్తమమున ఉన్నగ్రహము ఏడవ భాగము, చతుర్ధ అష్టమము లందున్న గ్రహము నాలుగవ భాగములో తమ ఫలితములనిచ్చును.

రెండు కంటె అధికగ్రహములు ఒకే రాశిలోనున్నచో, వారిలో బలాధిక గ్రహమునకే భాగము కల్పించవలయును.

**4. శ్లో॥ స్థానాన్యథైతాని సవర్ణయిత్వా**
**సర్వాణ్య థచ్ఛేద వివర్జితాని ।**
**దశాబ్ద పిండే గుణనాయథాంశం**
**ఛేదస్తదైక్యేన దశాప్రభేదః ॥**

## దశాధ్యాయి :

1-5-9-7-4-8 స్థానములలో ఉన్న గ్రహములకు చెప్పబడిన, అర్ద-తృతీయ-సప్తమాంశ-చతుర్ధాంశములను సమముగాచేసి, మూలదశా సం॥లను ప్రధమభాగమందున్న దిగువసంఖ్య చేగుణించి, మొత్తంచే భాగించగా ప్రధమ స్థానంలోఉన్న దశయొక్క అంతర్దశవస్తుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 స్థితి | 1 | 5-9 | సప్తమం | 4-8 | - |
| భాగం | 2 | 3 | 7 | 4 | మొత్తం 16. |

ఉదా : వృశ్చికలగ్నమునకు లగ్నమందు శని, సప్తమమందు శుక్రుడు ఉన్నారు. శనిదశలో శుక్రుని ఫలితములు గూర్చి ఇట్లు గుణించవలయును.

దశానాధుడైన శనికి సప్తమమందు శుక్రుడుండుటచేత 7వ భాగములో అనగా సప్తమాంశలో శుక్రుడు తన ఫలితముల నిచ్చును.

పైపట్టిక ప్రకారము సప్తమస్థానం క్రింద 7 కలదు. కనుక శనిదశ 19 సం॥లలో 7వ భాగములో శుక్రుడు తన ఫలితములనిచ్చును.

శనిదశ 19 సం॥లు.

19÷7 = 2సం. 8నె. 17రో. 3గం.

శనిదశ ప్రారంభం అయిన తరువాత 16సం॥3నె. 12రో. 17గం॥ తరువాత, చివరి 2సం॥8నె. 17రో. 3గం. శుక్రఫలితములు జరుగును.

వింశోత్తరీ విధానము వలెనె దశానాధునికి, అంతర్దశానాధుని అంతర్దశను గణించవలెను.

**మరొకవిధానము :**

దశానాధునికి 4-8లో గ్రహమున్నచో రవిదశలో, ఇట్లు అంతర్దశలను లెక్కించవలయును. రవిదశ 6సం॥లు. భాగముల మొత్తం16. 4-8లో గ్రహమున్నపుడు పట్టికలో 4కింద (చతుర్ధాంశ) చెప్పబడినది కనుక. దశాసం॥ 6ను 16చే గుణించగా, 96వచ్చును. దీనిని 16+4+4=24చేత భాగించగా 4వచ్చును. ఇది రవిదశలో రవిఅంతర్దశ 4సం॥లు 4లో ఉన్నగ్రహమునకు 6×4=24 దీనిని మొత్తం 24చేత భాగించగా 1సం॥ వచ్చును. ఇది 4లో ఉన్న గ్రహఅంతర్దశ. 8లో ఉన్న గ్రహమునకు కూడా 1సం॥ అంతర్దశ వచ్చును. మొత్తం 6సం॥లు.

**5. శ్లో॥ సమ్యగ్బలినం స్వతుంగభాగే**
**సంపూర్ణా బలవర్జితస్య రిక్తా ।**
**నీచాంశ గతస్య శతృభాగే**
**జ్ఞేయానిష్ట ఫలా దశాప్రసూతౌ ॥**

**దశాధ్యాయి :**

జాతకములందు షడ్బల సంపూర్ణుడైన గ్రహముతన ఉచ్చయందు సంపూర్ణ శుభఫలమిచ్చును. బలము లేనిది రిక్తదశశూన్యఫలం. నీచాంశను పొందిన





గ్రహము శతృక్షేత్రమందున్న గ్రహము అనిష్ట ఫలము నిచ్చును. విద్వజ్జన వల్లభం- అను గ్రంధమునందు

**శ్లో॥ పశ్యత్యే కశ్చేచ్ఛుభేషు స్వముచ్చం లగ్నం**
**ప్రాప్తః ఖేచరః ప్రశ్నకాలే ।**
**స్థానైశ్వర్యార్థోచ్ఛ్రయో మానవృద్ధిః**
**వాచ్యా నిస్సందేహమేవాత్ర తజ్ఞైః ॥**

సారావళియందును ఇదేవిషయము చెప్పబడినది. ప్రశ్నచూచునపుడు కూడా ఇదే బలవిషయము ఆలోచించవలయును.

ఉచ్చపొందిన గ్రహము - వక్రించిన గ్రహము యొక్క బలము ఇతరులు హరించలేరు.

**6. శ్లో॥ భ్రష్టస్యతుంగా దవరోహి సంజ్ఞా**
**మధ్యా భవేత్ సా సుహృదుచ్చ భాంశే ।**
**ఆరోహిణీ నిమ్న పరిచ్యుతస్య**
**నీచారిభాంశే ష్వధమా భవేత్ సా ॥**

**దశాధ్యాయి :**

గ్రహము తన ఉచ్చభాగదాటి-నీచకు వెళ్లునపుడు దానిని 'అవరోహిదశ' అందురు. ఆగ్రహము స్వోచ్చనవాంశ-స్వనవాంశ యందు ఉన్న అది మధ్యమ దశ అగును.

నీచభాగలు దాటి ఉచ్చదిశగా వెళ్లు గ్రహముయొక్క దశ "ఆరోహి దశ" అనబడును.

ఇది నీచ-శతృ నవాంశలయందున్న అధమదశ అనబడును.

**7. శ్లో॥ నీచారిభాగే సమవస్థితస్య శస్తేగృహే మిశ్రఫలాప్రదిష్టా।**
**సంజ్ఞానురూపాణి ఫలాని చైషాం దశాసు వక్ష్యామి యథోపయోగమ్॥**

## దశాధ్యాయి :

గ్రహము రాశిలో బాగుండి-అంశలో నీచ-శతృనవాంశలు పొందిన మిశ్రఫలమిచ్చును. గ్రహములు వాని సంజ్ఞను రూపముగా ఫలములనిచ్చును. ఏదశయందు ఏఫలమిచ్చునో చెప్పెదను.

## సారావళియందు :

**శ్లో॥ అత్యుగ్రమతి ద్రవ్యం మహాంతమపిభాస్కరః స్వతుంగస్థః ।**
**మృష్టాశనాంబరాఢ్యం సుభూషణంశీతగుః కురుతే ॥**
**తేజస్వినం కుతనయో దుఃఖసహం గర్వితం ప్రవాసరతం**
**మేధావినం కులాఢ్యం సునిపూణవాక్యం బుధః స్వోచ్చే ।**
**విఖ్యాతం గురురాఢ్యం విద్వాంసం భూతసత్కృతం కుశలం**
**స్వోచ్చే భృగోశ్చ తనయో విలాసహాస్య ప్రగీతనృత్తరసం**
**స్వోచ్చస్థో రవితనయో నృపలబ్ధ నియోగమభిజనయేత్ ॥**

ఇత్యాదిగా చెప్పబడినది.

భావఫలములు చెప్పునపుడు గ్రహములు లేనిభావములకు ఆరాశ్యాధిపతి ఫలము నిచ్చును.

గర్గుడు - యవనేశ్వరులు దీనినే గణితవిధానమున సాధించి షడ్బలములను నిర్ణయించిరి.

**8. శ్లో॥ ఉభయేఽధమ మధ్యపూజితా ద్రేక్కాణైశ్చరభేషు చోత్క్రమాత్ ।**
**అశుభేష్టసమా స్థిరే క్రమాత్ హోరాయాః పరికల్పితా దశా ॥**

## దశాధ్యాయి :

ద్విస్వభావరాశిలగ్నమై, ప్రథమ ద్రేక్కాణమందు లగ్నముయున్న అశుభం, ద్వితీయం మధ్యమం, తృతీయం శుభం.





చరరాశిలగ్నమై, ప్రథమ ద్రేక్కాణమందు లగ్నమున్న శుభం, ద్వితీయం మధ్యమం, తృతీయం అశుభం.

స్థిరరాశిలగ్నము, ప్రథమ ద్రేక్కాణమందు లగ్నమున్న అశుభం, ద్వితీయం శుభం, తృతీయం మధ్యమం.

**9. శ్లో॥ ఏకంద్వేనవ వింశతిః ధృతికృతీ పంచాశదేషాంక్రమాత్**
**చంద్రారేందుజ శుక్రజీవదినకృద్దైవాకరీణాంసమాః ।**
**స్వేస్వే పుష్పఫలా నిసర్గసమయే పక్తిర్దశాయాః క్రమాత్**
**అంత్యే లగ్నదశా శుభేతియవనాః నేచ్ఛంతి కేచిత్తధా ॥**

## దశాధ్యాయి :

గ్రహముల నైసర్గిక దశాసంవత్సరములు. ఇది ప్రతీమానవుడు పుట్టిన దగ్గరనుంచి వరుసగా లెక్కించవలయును. మొట్టమొదటి దశ చంద్రుడు. కాల పరిమితి 1సం॥రము. ఇతడు జలాత్మకుడు చేష్టలుండవు పాలుత్రాగువయసు. రెండవదశ కుజుడు - 2సం॥ దశాకాలము. బాల్యములో రసాదుల యందిష్టము, సోదరసోదరీ జననము. తృతీయదశ బుధుడు - ఇది 9సం॥లు ఇది విద్యాభ్యాసకాలము, చతుర్థము శుక్రుడు 20సం॥లు విషయవాంఛలు - సంసారము - పంచమము గురుడు 18సం॥లు జ్ఞానము - సుఖము. షష్ఠము రవి 20సం॥లు వృద్ధాప్యము. ఆత్మజ్ఞాన సంపాదన, సప్తమము శని 50సం॥లు, మృతప్రాయుడు లేదా మరణము.

ఇవి వారివారి శుభత్వముననుసరించి, ఆయా నైసర్గికదశలలో వారి ఫలితములుండును.

**10. శ్లో॥ పాకస్వామిని లగ్నగే సుహృదివా వర్గేఽస్య సౌమ్యేపివా**
**ప్రారబ్ధాశుభదా దశా త్రిదశషడ్లాభేషు వా పాకపే ।**
**మిత్రోచ్చోపచయ త్రికోణమదగః పాకేశ్వరస్యస్థితః**
**చంద్రస్సత్ఫలబోధనాని కురుతే పాపానిచాత్తోఽన్యధా ॥**

**దశాధ్యాయి :**

వర్తమాదశానాధుడు దశారంభ కాలమున లగ్నములోనున్న-మిత్రగ్రహము గోచారరీత్యా లగ్నమున ఉన్ననూ 3-6-10-11 స్థానములో నున్ననూ, ఆదశ శుభ ఫలితములనిచ్చును.

త్రికోణములందు - సప్తమమున మిత్రోచ్చ ఉపచయములందు చంద్రుడున్ననూ, ఆదశ శుభఫలితములిచ్చును. ఇతరములందు చెడుఫలితమిచ్చును.

**శ్లో॥ సవితాదశాఫలానాం పాచయితా చంద్రమాప్రబోధయితా ।**
**ఆదిత్యచంద్రవశగాః సర్వేతారాగ్రహాఃజ్ఞేయాః ॥**

చంద్రుడు మిత్ర-ఉచ్చ-ఉపచయములందు దశాప్రారంభమున ఉన్న, ఆదశ శుభఫలితములనిచ్చును.

**11. శ్లో॥ ప్రారబ్ధా హిమగౌ దశా స్వగృహగే సౌఖ్యార్థ మానావహా**
**కౌజే దూషయతిస్త్రియం బుధగృహే విద్యాసుహృద్విత్తదా ।**
**దుర్గారణ్యపథాలయా కృషికరీ సింహే సితర్క్షేఽన్నదా**
**కుస్త్రీదా మృగకుంభయోః గురుగృహే మానార్థ సౌఖ్యావహా ॥**

**దశాధ్యాయి :**

దశారంభ సమయమున చంద్రుడు గోచారరీత్యా స్వగృమమందున్న సౌఖ్యం-సన్మానం-సంపద. మేష వృశ్చికములందున్న స్త్రీదోషం. మిధునకన్యలయందున్న విద్య-బంధు-విభవములు-సింహమందు శ్రమ-వృషభ తులలందు విందులు-వినోదాలు-మకర కుంభములందున్న దుష్ట స్త్రీ సమాగమం, ధనుర్మీనములందున్న సంపత్ సౌఖ్య సన్మానములు జరుగును.

**ఈ విషయమున శ్రీపతి :**

**శ్లో॥ అమృతకిరణ వీర్యాత్ వీర్యమాశ్రిత్య సర్వే**
**విదధతి ఫలమేతే ఖేచరాః సాధ్వసాధు ।**





**నిజనిజ విషయేషు వ్యాప్రియంతే యథామూన్**
**అలమిహమనసేవాధిష్ఠితానీంద్రియాణి ॥**

అని చంద్రబల విశిష్ఠత గట్టిగా చెప్పాడు.

**12.శ్లో॥ సౌర్యాంస్వం నఖదంతచర్మ కనక క్రౌర్యాధ్వ భూపాహవైః**
**తైక్ష్ణ్యం ధైర్యమజస్రముద్యమరతిః ఖ్యాతిః ప్రతాపోన్నతిః ।**
**భార్యాపుత్ర ధనారి శస్త్రహుతభుగ్భూపోద్భవా వ్యాపదః**
**త్యాగః పాపరతిః స్వభృత్య కలహో హృత్ క్రోడపీడామయాః ॥**

**దశాధ్యాయి :**

**సూర్యదశాంతర్దశా ఫలితములు :**

సూర్యుడు తన దశలోనూ, అంతర్దశానాధుడైనపుడు, నఖ-దంత-చర్మ-బంగారములవల్ల, కోపమువల్ల, రోడ్లు నిర్మాణము వల్ల, ప్రభుత్వము వల్ల ధనప్రాప్తి, కోపము-ధైర్యము-శతృజయం కలుగును.

వివాహ-సంతానములు కలుగును. శతృ-శస్త్రచికిత్స-అగ్ని-ప్రభుత్వముల వల్ల కష్టముల కలుగును.

సూర్యుడు అశుభుడైనచో సేవకులతో కలహం-గర్భ-హృదయవ్యాధులు కలుగును.

**చంద్ర దశాంతర్దశా ఫలితములు :**

**13. శ్లో॥ ఇందోః ప్రాప్యదశాంఫలాని లభతే మంత్రద్విజాత్యుద్భవాన్**
**ఇక్షుక్షీర వికార వస్త్రకుసుమ క్రీడా తిలాన్నశ్రమైః ।**
**నిద్రాలస్య మృదుద్విజామరరతిః స్త్రీజన్మ మేధావితా**
**కీర్త్యర్థోపచయక్షయౌ చబలిభిర్వైరం స్వపక్షేణచ ॥**

## దశాధ్యాయి :

చంద్ర దశాంతర్దశలలో మంత్రములు-బ్రాహ్మణములు-చెరకు-పాలు-వస్త్ర, కుసుమ-క్రీడ-తినుబండారములు-తిలలు-వలన ధనము లభించును.

నిద్ర-బద్ధకము-సౌమ్యగుణము-దేవబ్రాహ్మణభక్తి-స్త్రీ సంతానము-తెలివి-ధనం-కీర్తి కలుగును.

అశుభచంద్రుని వలన ధననష్టం-అపకీర్తి-బంధువిరోధం-బలవద్విరోధం ఏర్పడును.

## కుజదశాంతర్దశా ఫలితములు :

**14. శ్లో॥ భౌమస్యారి విమర్ధభూపసహజక్షిత్యా వికారైర్ధనం**
**ప్రద్వేషస్సుత మిత్రదారసహజైః విద్వద్గురు ద్వేషతా ।**
**తృష్ణాసృక్ జ్వర భంగపిత్తజనితా రోగాః పరస్త్రీష్టతా**
**ప్రీతిః పాపరతైః అధర్మనిరతిః పారుష్యతైక్ష్ణ్యాదిచ ॥**

## దశాధ్యాయి :

కుజదశాంతర్దశలలో ప్రభుత్వ-సోదర-భూ-మూలక ధనలాభము-.

కళత్ర-పుత్ర-మిత్ర-భ్రాతృ-గురువులతో శత్రుత్వము. దాహము- రక్తస్రావము-వ్రణ-చోర-జ్వరబాధలు-కలహములు-దెబ్బలు-కఠినపు మాటలు-కోపము కలుగును.

## గురు దశాంతర్దశా ఫలితములు :

**15. శ్లో॥ జైవ్యాం మానగుణోదయో మతిచయః కాంతిః ప్రతాపోన్నతిః**
**మాహాత్మ్యోద్యమ మంత్రనీతి నృపతి స్వాధ్యాయయజ్ఞైర్ధనం।**
**హేమాశ్వాత్మజ కుంజరాంబరచయః ప్రీతిశ్చసద్భూమిపైః**
**సూక్ష్మోహాగమనైపుణం శ్రవణరుగ్వైరం విధర్మాశ్రితైః ॥**





## దశాధ్యాయి :

గురుదశాంతర్దశలలో సన్మానము-విద్య-వినయము-ఓజస్సు-బుద్ధి వైశద్యము-ఉపకార స్వభావము-గొప్పపనులు తలపెట్టుట-వేదాధ్యయనము-మంత్రజపము-ఉన్నతపదవి-ధనలబ్ధి-వాహన యోగములు-గొప్పవారితో స్నేహము-కీర్తి కలుగును.

అశుభ గురుకాలములో దురాలోచనలు-చెవిరోగములు-అవినీతి పరులతో స్నేహము-శత్రుత్వము కలుగును.

## బుధ దశాంతర్దశ ఫలితములు :

**16. శ్లో॥ బౌధ్యాం దౌత్య సుహృద్ ద్విజగురుధనం విద్వత్ప్రశంసాయశః**
**యుక్తిద్రవ్యసువర్ణ వేసరమహీ సౌభాగ్యసౌఖ్యాప్తయః**
**హాస్యోపాసన కౌశలం మతిచయో ధర్మక్రియా సిద్ధయః**
**పారుష్యశ్రమబంధ మానసరుజా పీడాచధాతుత్రయాత్ ॥**

## దశాధ్యాయి :

బుధదశాంతర్దశలలో-వ్రాయుట-మాట్లాడుట-మిత్ర-బంధువుల వలన ధనము ప్రాప్తించును. కీర్తి-వాహనలాభము-బిరుదులు-హాస్యము-కళాకౌశలం-ధర్మకార్యనిర్వహణ-సునిశిత మేధస్సు కలుగును.

అశుభుడైనచో శ్రమ-కలహం మనోవ్యాధి-బంధువిరోధం-బంధనం-కఠినముగా మాట్లాడుట-శారీరిక వ్యాధులు కలుగును.

## శుక్రదశాంతర్దశా ఫలితములు :

**13. శ్లో॥ శౌక్ర్యాంగీత రతిప్రమోదసురభి ద్రవ్యాన్న పానాంబర**
**స్త్రీరత్నద్యుతి మన్మథోపకరణ జ్ఞానేష్ట మిత్రాగమాః ।**
**కౌశల్యం క్రయవిక్రయే కృషినిధి ప్రాప్తిర్ధనస్యాగమః**
**వన్యవ్యాధ నిషాదధర్మ రహితైః వైరంశుచః స్నేహతః ॥**

**దశాధ్యాయి :**

శుక్ర దశాంతర్దశలలో-పాటలు-సంతోషము-పరిమళ ద్రవ్యములు-మృష్టాన్నం-పానీయములు గొప్పవస్త్రములు-స్త్రీలు- అలంకారములు-సంభోగము జ్ఞానము-ఇష్టసమాగమము-మిత్రాగమనము కళాకౌశలము-క్రయవిక్రయముల లాభము-నిధిప్రాప్తి-ధనవృద్ధి కలుగును.

అశుభుడైనచో జనవిరోధం-స్త్రీవలన అరిష్టం-మిత్రులవల్ల శోకము కలుగునును.

**శనిదశాంతర్దశా ఫలితములు :**

**18. శ్లో॥ సౌరింప్రాప్య ఖరోష్ట్రపక్షి మహిషీ వృద్ధాంగనావాప్తయః**
**శ్రేణీగ్రామపురాధికార జనితా పూజా కుధాన్యాగమః ।**
**శ్లేష్మేర్ష్యానిల కోపమోహమలిన వ్యాపత్తి తంద్రీశ్రమా**
**భృత్యాపత్య కళత్ర భర్త్సనమపి ప్రాప్నోతిచ వ్యంగతామ్ ॥**

**దశాధ్యాయి :**

శనిదశాంతర్దశలలో పశువులు-వ్యవసాయములవల్ల లాభము. వృద్ధస్త్రీ-అధికార ప్రాప్తి. పాడైన వస్తువువల్ల లాభము. కీర్తి కలుగును.

అశుభుడైనచో ఈర్ష్య-కోపము-వ్యాధులు-వాత దోషము-నిద్ర, కళత్ర-పుత్ర తిరస్కారము, అంగవైకల్యము ప్రాప్తించును.

**19. శ్లో॥ దశాసుశస్తాసు శుభానికుర్వం-**
**త్యనిష్ఠ సంజ్ఞాస్వశుభాని చైవం**
**మిశ్రాసు మిశ్రాణి దశాఫలాని**
**హోరాఫలం లగ్నపతేస్సమానమ్ ॥**





**దశాధ్యాయి :**

గ్రహములు శుభక్షేత్రములందున్నపుడు శుభఫలముల నిచ్చును. అశుభ క్షేత్రములందు అశుభ ఫలితములనిచ్చును. మిశ్రమములలో మధ్యమ ఫలిత మిచ్చును.

లగ్నదశాఫలము-జాతక విషయములోను, ప్రశ్నవిషయములోను లగ్నాధి పతి బలమునసనుసరించి ముఖ్యముగా చూడవలయును.

**20. శ్లో॥ సంజ్ఞాధ్యాయే యస్యయద్ద్రవ్యముక్తం**
**కర్మాజీవే యస్యయచ్చోపదిష్టం-**
**భావస్థానాలోక యోగోద్భవం చ**
**తత్తత్ సర్వం తస్యయోజ్యం దశాయామ్ ॥**

**దశాధ్యాయి :**

సంజ్ఞాధ్యాములో (రాశిప్రభేదాధ్యాయం) (గ్రహయోనిప్రభేదాధ్యాయం) గ్రహములకు సూచింపబడిన పదార్ధ-గుణ విశేషములు-

కర్మజీవాధ్యాయములో గ్రహములకు సూచింపడబడిన ఫలితములూ-

భావఫలితములు-దృష్టి ఫలితములు-గ్రహముల సమ్మేళనము వలన ఏర్పడు యోగములు.

ఇవన్నీ ఆయాదశలయందు ఫలితములనిచ్చును.

సూర్యుడు బలముగానున్నచో సూర్యకారకత్వ సంబంధములైన-ఫలితములు. సూర్యదశయందు ఫలితములనిచ్చును.

ఆత్మ ప్రభావము-ప్రభుత్వము వలన లబ్ధి-ఎరుపు ద్రవ్యలాభం-రాగి మొ॥ లోహప్రాప్తి-రాజకులముతో స్నేహము-సత్త్వగుణము అలవడుట-మధుపింగళ వర్ణము-ఎముకధాతు బలము మొ॥ కలుగును.

సూర్యుడు బలహీనుడైనచో పైవాటికి వ్యతిరేకఫలితములు సంభవించును.

ఏభావమునందు పాపగ్రహములుండునో ఆ భావమునకు హానిజరుగును. 6-8-12 భావములందు మాత్రము పాపగ్రహములుండుట మంచిది.

12లో శుభులున్న ఖర్చు ఉండదు. 8లో శుభులున్న మరణనాశనము చేయును. 6లో శుభులున్న శత్రునాశనం చేయును. కాని వరాహ మిహిరాచార్యుల అభిప్రాయరీత్యా 8-12 భావములలో మాత్రము ఏగ్రహము లున్ననూ మంచిదికాదు. 6లో శుభులు శత్రునాశనము చేయుదురు. 8-12లో శుక్రుడు మినహా ఏగ్రహమూ మంచిఫలితమివ్వదు.

## స్వల్పజాతక గ్రంథమందు :

**శ్లో॥ పుష్ణంతి శుభాః భావాన్ మూర్త్యాదీన్**
**ఘ్నంతి సంస్థితాః పాపాః ।**
**సౌమ్యాః షష్ఠేఽరిఘ్నాః**
**సర్వేనేష్టాః వ్యయాష్టమగాః ॥**

రాజయోగ-చంద్రయోగ-ద్విగ్రహయోగ-ప్రవ్రజ్యాయోగ-అరిష్టయోగ-నిర్యాణయోగ-ఆశ్రమయోగోద్భవ ఫలములు అన్నియూ దశలయందు అనుసంధానము చేయవలయును.

**శ్లో॥ అధిపః సర్వభావానాం కారకః పరికీర్తితః**
**కర్తా భావగతః ప్రోక్తః తథాతద్భావ వీక్షితః ॥**

అని ఒకచోట చెప్పబడినది.

లగ్నాది-ద్వాదశభావములకు ఆయా అధిపతులచేత, సౌమ్యగ్రహముల చేత సంబంధమున్నచో ఆ భావము శుభపలితమిచ్చును. శత్రుగ్రహములు, పాపగ్రహముల సంబంధమున్నచో హాని కలుగును.





దోషనివారణ నిమిత్తమే బ్రహ్మ, దయార్ద్రచిత్తుడై గురుశుక్రులను సృష్టించెనట!

**శ్లో॥ దోషాంబురాశి తరణాయ కృపార్ద్రచేతాః**
**పోతం ససర్జ గురుశుక్రమయం విధాతా ॥**

అష్టమ భావ అధిపతి, ఏ భావంలో ఉంటాడో ఆ భావం నశిస్తుంది. ఏమీ సందేహంలేదు-దానికి ప్రమాణం.

**శ్లో॥ యద్భావస్థోఽష్టమపః**
**తద్భావో నశ్యతే న సందేహః ॥**

ఉపగ్రహముల స్థితి విషయములో-భార్యానాశనము గూర్చి-గర్గి భగవానులు, శుక్రుని నుంచి 4-8 స్థానములలో పాపగ్రహముల కారణము ఇట్లు చెప్పారు.

**శ్లో॥ చతుర్థాష్టమగైః శుక్రాత్ సౌరారార్క్యైః హుతాశనాత్।**
**తేషాం ద్వితీయ మధ్యస్థే తథా శుక్రే ప్రపాత నాత్**
**శుక్రే తద్యోగ దృక్ హీనే పాశాత్ భార్యా వధో భవేత్ ॥**

మరియు ఫలిత నిర్ణయములో, లగ్నము-చంద్రరాశి-సూర్యుదున్న రాశి నుంచి తప్పక భావములను పరిశీలించవలయును.

అంతేగాక-"గ్రహభుక్త నవాంశ రాశితుల్యం। బహుసామ్యం సముపైతి సత్యవాక్యం॥ అని వరాహమిహిరులు చెప్పుటవలన "నవాంశ" కే అత్యధిక ప్రామాణ్యము కలదని తెలియుచున్నది.

చంద్రబల విషయములో శుక్లపక్ష చంద్రునికే అధికబలమని గ్రహించ వలయును.

యోగముల విషయములో-జీవశర్మ మొ॥వారు, నవాంశ చక్రములోని గ్రహములననుసరించి యోగములు చెప్పవలెనని అభిప్రాయపడ్డారు.

శృతకీర్తి మొ॥వారు, కేంద్రగత గ్రహముల ననుసరించియే యోగములు కలుగునని భావించారు.

## శృతకీర్తి :

శ్లో॥ చంద్రా చ్చతుర్థ సంస్థైః సునభా దశమస్థైః కీర్తితానభా।
విహగైరు భయస్థితైర్దురుధురా కేమద్రుమ సంజ్ఞితో-న్యధా॥

అనగా - చంద్రునికి 4వ స్థానములో గ్రహములున్నచో సునభాయోగము, 10లో గ్రహములున్నచో అనభాయోగము. 4-10లో ఉంటే దురుధురా యోగము, గ్రహములు లేకున్న కేమద్రుమియోగము.

అయితే జీవశర్మ మాత్రము, నవాంశలో చంద్రునికి 2లో గ్రహమున సునభాయోగము, 12లో గ్రహమున్న అనభాయోగము, రెండుప్రక్కల గ్రహములులేకున్న కేమద్రుమయోగము కలుగునని చెప్పెను.

యోగములు సారావళి యందు విస్తరముగా చెప్పబడినది.

సారావళియందు "భద్రయోగ" ఫలితము చెప్పబడలేదు. అది శాస్త్రాంతర మందు ఈ విధముగానున్నది.

శ్లో॥ శంఖాసికుంజర గదా కుసుమేషుకేతు
చక్రాబ్జలాంగల విచిహ్నితపాణి పాదః।
పత్రాగరుద్విపమద ప్రథమాంబుసిక్త
భూకుంకుమ ప్రతిమ గంధ తనుస్సుఘోణః
శాస్త్రార్థవిద్ ధృతియుతస్సమ సంహతభ్రూః
నాగోపమోభవతి వస్త్ర నిగూఢగుహ్యః।
సత్కుక్షిధర్మ నిరతస్సులలాట జంఘో
ధీరస్థిరో౽ప్యసిత కుంచిత కేశభారః॥

ప్రశ్నవిషయములందు కూడా గ్రహములకు చెప్పబడిన తద్ద్రవ్య- గుణ- స్థల-కాలాదులు అనుసంధానించి ఫలితనిర్ణయము చేయవలయును.





21. శ్లో॥ ఛాయాంమహాభూత కృతాంచ సర్వే౽
భివ్యంజయంతి స్వదశామవాప్య।
క్ష్మాంబ్వగ్ని వాయ్వంబర జాన్ గుణాంశ్చ
నాసాస్య దృక్త్వక్ శ్రవణానుమేయాన్॥

## దశాధ్యాయి :

దశానాధుని లక్షణములు, జాతకుని శరీరమునందు-ఛాయా మాత్రముగా ప్రత్యక్షముగా గోచరించును.

తన దశయందు గ్రహము, తన మహాభూతచ్ఛాయను జాతకునియందు ప్రకటించును.

జన్మ సమయమందు కూడా గ్రహముల ప్రభావము ప్రత్యక్షముగా కనబడును. దీనిని దర్శించుటకు శాస్త్రజ్ఞానము, సూక్ష్మ పరిశీలనాశక్తి, ఆసక్తి కావలయును.

పంచమహాభూతములూ, జ్ఞాన, కర్మేంద్రియములందు గ్రహప్రభావముచే మహాభూతఛాయ వ్యక్తపరచును.

22 శ్లో॥ శుభ పలదదశాయాం తాదృగేవాంతరాత్మా
బహుజనయతి పుంసాం సౌఖ్యమర్థాగమంచ।
కథిత పలవిపాకైః తర్కయేద్వర్తమానాం
పరిణమతి ఫలోక్తిః స్వప్నచింతాస్వవీర్యైః॥

## దశాధ్యాయి :

శుభఫలితము నిచ్చెడి దశయందు జాతకుని మనస్సు నిత్యసంతోషముగా, శాంతముగా నుండును. అనేక విధములైన సౌఖ్యములను, సంపదను కలిగించును.

వర్తమాన ఫలితమును గూర్చి బాగుగా ఆలోచించవలయును.

బలవంతులైన గ్రహములిచ్చు ఫలితములు అనుభూతములగును. బలములేని గ్రహములిచ్చు శుభాశుభ ఫలితములు రెండునూ కేవలం స్వప్న మందు గోచరించి కర్మక్షయమగును. శాస్త్రాంతరమందు స్వప్నములు 7 విధములుగా చెప్పబడినది.

**శ్లో॥ దృష్టః శృతోఽనుభూతశ్చ ప్రార్థితో కల్పితస్తథా।**
**భావిజో దోషజశ్చైవం స్వప్నః సప్తవిధ స్మృతః॥**

ఇందు "భావిజస్వప్నమే" బలహీన గ్రహమిచ్చు కర్మఫలితము.

ఆయుస్థితి జాతకుని ప్రథమ సం॥నందు సద్యోరిష్టయోగము ననుసరించి యుండును. తరువాత 12సం॥ల వరకు అరిష్టయోగము ననుసరించి యుండును. ఇకనుంచి 32సం॥ల వరకూ దశాభేదములచేత యోగారిష్టము ననుసరించి యుండును. తరువాత 70సం॥ వరకు దశాసాపేక్షచే మధ్యమాయువు ఉండును. తరువాత 120 సం॥ల వరకు కేవలం దశలనను సరించే యుండును. తరువాత అమితాయుర్యోగము ననుసరించి యుండును.

ఆయుర్విషయములో ముందు 1.మయయవన మణిత్థపరాశరులు, 2.సత్యాచార్యులు. 3.జీవశర్మలు, చెప్పినది బాగుగా పరిశీలించి జ్యోతిష పండితుడు శాస్త్ర-అనుభవ-ఉపాసనా బుద్ధిబలముచేత నిర్ణయించవలయును.

**23. శ్లో॥ ఏకగ్రహస్య సదృశే ఫలయోర్విరోధే**
**నాశంవదేద్యదధి కం పరిపచ్యతేతత్।**
**నాన్యో గ్రహస్సదృశమన్యఫలం హినస్తి**
**స్వాంస్వాం దశాముపగతాః స్వఫలప్రదాః స్యుః ॥**

**దశాధ్యాయి :**

రెండు గ్రహముల శుభాశుభ ఫలితములు సమానముగా నున్నపుడు ఫలితము శూన్యము. శుభమైనా, అశుభమైనా ఫలాధిక్య బలము కలిగినపుడు ఆగ్రహము తనదశయందు ఆ ఫలితమిచ్చును.





నైసర్గికదశా-అంతర్దశ-విదశరాశి ఫలభావఫల-యోగఫల-దృష్టిఫల. అష్టకవర్గఫల, హోరాదివర్గఫల ప్రత్యబ్దమాస-ద్యు-నిశాఫలాది భేదములచే బలవద్గ్రహములు ఫలితమిచ్చును.

అష్టమాధిపతి మాత్రము ఏభావమునందుండునో ఆ భావమును పాడుచేయును. సందేహములేదు.

శ్రీపతి దశాపరిపాకముల గూర్చి ఇతరుల పూర్వాభిప్రాయమిట్లు చెప్పెను.

యవనులరీత్యా 12 విధములు-మణిత్థ-బాదరాయణాదులు-8 విధ ములు-సిద్ధసేన-దేవలఋషులు 6విధములు-విష్ణుగుప్తులు-3విధములు. సత్యాచార్యులు 2విధములుగా చెప్పిరి.

ఇతి గోవిందసోమయాజికృతౌ బృహజ్జాతక
వ్యాఖ్యాయాం దశాధ్యాయ్యాఖ్యాయాం
అష్టమాధ్యాయః

★★★

## నవమాధ్యాయః

## అష్టకవర్గాధ్యాయః

**1. శ్లో॥ స్వాదర్కః ప్రథమాయ బంధునిధన ద్వ్యాజ్ఞాత పో ద్యూనగో।**
**వక్రాత్ స్వాదివతద్వదేవ రవిజాః శుక్రాత్ స్మరాంత్యారిషు**
**జీవాద్ధర్మసుతాయ శత్రుషుదశ త్ర్యాయారిగ శ్శీతగోః**
**తేష్వేవాంత్య తపస్సుతేషుచ బుధాల్లగ్నాత్స బంధ్వంత్యగః॥**

**దశాధ్యాయ :**

గ్రహములు7, 1లగ్నము కలిపి అష్టకవర్గు అనబడును. ఇందు ముందుగా సూర్య-కుజ-శనులు పాపగ్రహములు చెప్పబడినవి. తరువాత శుక్ర- గురు- బుధ-చంద్రులు శుభగ్రహములు చెప్పబడ్డాయి.

దీనివలన తెలియునదేమనగా పాపగ్రహములు దుఃఖ ఫలితమిచ్చును గావున వాటికి పరిహార శుభక్రియలు చేయవలయును.

అష్టకవర్గరీత్యా "అదృఢ కర్మఫలమునకే పరిహార్యము చేయదగును. దృఢ కర్మని చెడుఫలితము పరిహారము చేసిననూ ఫలితము ఉండదు.

జన్మకాల గ్రహములకు, గోచారవశమున ఒక్కొక్క రాశిలో గ్రహచారము జరుగునపుడు ఇచ్చు ఫలితములను తెలియజేయునదే అష్టకవర్గు.

## సూర్యాష్టకవర్గు :

సూర్యుడు తానున్న రాశినుంచి 1-2-4-7-8-9-10 11స్థానములలో నున్నచో శుభఫలితమిచ్చును.

| | | |
|---|---|---|
| కుజుడుస్థానం నుంచి | - | 4-7-8-9-10-11 |
| శని | - | 4-7-8-9-10-11 |
| శుక్రుడు | - | 6-7-12 |
| గురుడు | - | 5-6-9-11 |
| బుధుడు | - | 3-5-6-9-10-11-12 |
| చంద్రుడు | - | 3-6-10-11 |
| లగ్నము | - | 3-4-6-10-11-12 |

## చంద్రాష్టకవర్గు :

**2. శ్లో॥ లగ్నాత్‌షట్ త్రిదశాయగస్వధనధీ ధర్మేషు చారాచ్ఛశీ।**
**స్వాత్సాస్తాదిషు సాష్టసప్తసు రవేః షట్ త్ర్యాయధీ స్థో యమాత్।**
**ధీత్ర్యాయాష్టమ కంటకేషుచ బుధా జ్జీవాద్ధనాయాష్టగః।**
**కేంద్రస్థశ్చ సితాత్తు ధర్మ సుఖధీ త్ర్యాయాస్పదా నంగగః॥**





## దశాధ్యాయి :

| | | |
|---|---|---|
| లగ్నమునుంచి | - | 3-6-10-11 |
| కుజుదున్న స్థానంనుంచి | - | 2-3-5-6-9-10-11 |
| చంద్రుడున్న | - | 1-3-6-7-10-11 |
| సూర్యుడున్న | - | 3-6-7-8-10-11 |
| శనియున్న | - | 3-5-6-11 |
| బుధుడున్న | - | 1-3-4-5-7-8-10-11 |
| గురుడున్న | - | 1-4-7-8-10-11-12 |
| శుక్రుడున్న | - | 3-4-5-7-9-10-11 |

## కుజాష్టకవర్గు :

**3. శ్లో॥ వక్రస్తూపచయేష్వినాత్ సత్‌నయే ష్వాద్యాధికే షూదయాత్**
**చంద్రాద్‌ద్విట్‌త్రిఫలేషు కేంద్రనిధన ప్రాప్త్యర్థగః స్వాచ్ఛుభః।**
**ధర్మాయాష్టమ కేంద్రగోర్కృతనయాత్ జ్ఞాత్ షట్‌త్రిధీ లాభగః**
**శుక్రాత్‌షడ్వ్యయలాభ మృత్యుషుగురోః కర్మాంత్య లాభారిషు॥**

## దశాధ్యాయి :

| | | |
|---|---|---|
| సూర్యునినుంచి | - | 3-5-6-10-11 |
| లగ్నమునుంచి | - | 1-3-6-10-11 |
| చంద్రునినుంచి | - | 3-6-11 |
| కుజునినుంచి | - | 1-2-4-7-8-10-11 |
| శనినుంచి | - | 1-4-7-8-9-10-11 |
| బుధునినుంచి | - | 3-5-6-11 |
| శుక్రునినుంచి | - | 6-8-11-12 |
| గురునినుంచి | - | 6-10-11-12 |

**బుధాష్టక వర్గు :**

4. శ్లో॥ ద్వ్యాద్యాయాష్ట తపస్సుఖేషు భృగుజాద్సత్రాత్మజేష్వింందుజః
సాజ్ఞాస్తేషుయమారయోర్వ్యయరిపు ప్రాప్త్యష్టగోవాక్పతేః ।
ధర్మాయారి సుతవ్యయే సవితుస్స్వాత్సాద్య కర్మత్రిగః
షట్స్వాయాష్టసుఖాస్పదేషు హిమగోః సాద్యేషు లగ్నాచ్ఛుభః ॥

**దశాధ్యాయి :**

| | | |
|---|---|---|
| శుక్రునినుంచి | - | 1-2-3-4-5-8-9-11 |
| కుజునినుంచి | - | 1-2-4-7-8-9-10-11 |
| శనినుంచి | - | 1-2-4-7-8-9-10-11 |
| గురునినుంచి | - | 6-8-11-12 |
| సూర్యునినుంచి | - | 5-6-9-11-12 |
| బుధునినుంచి | - | 1-3-5-6-9-10-11-12 |
| చంద్రునినుంచి | - | 2-4-6-8-10-11 |
| లగ్నమునుంచి | - | 1-2-4-6-8-10-11 |

**గుర్వష్టక వర్గు :**

5. శ్లో॥ దిక్స్వాద్యాష్టమ దాయ బంధుషు కుజాత్సాత్సత్రి కేష్వంగిరాః
సూర్యాత్సత్రినవేషు ధీ స్వనవదిగ్ లాభారిగో భార్గవాత్ ।
జాయాయార్ధ నవాత్మజేషు హిమగోః మందాత్రిషడ్వ్యయే।
దిగ్ధీషట్ స్వసుఖాయ పూర్వనవగో జ్ఞాత్సస్మర శ్చోదయాత్॥





**దశాధ్యాయి :**

| | | |
|---|---|---|
| కుజునినుంచి | - | 1-2-3-4-7-8-10-11 |
| గురునినుంచి | - | 1-2-3-4-7-8-10-11 |
| సూర్యునినుంచి | - | 1-2-3-4-7-8-9-10-11 |
| శుక్రునినుంచి | - | 2-5-6-9-10-11 |
| చంద్రునినుంచి | - | 2-5-7-9-11 |
| శనినుంచి | - | 3-5-6-12 |
| బుధునినుంచి | - | 1-2-4-5-6-9-10-11 |
| లగ్నమునుంచి | - | 1-2-4-5-6-7-9-10-11 |

**శుక్రాష్టకవర్గు :**

6. శ్లో॥ లగ్నాదాసుత లాభరంధ్ర నవగ స్యాంత్యశ్శశాంకాత్సితః।
స్వాత్సాజ్ఞేషు సుఖత్రిధీనవదశ ఛిద్రాప్తిగస్సూర్యజాత్।
రంధ్రాయవ్యయగో రవేర్నవదశ ప్రాప్త్యష్టధీస్థోగురోః
జ్ఞాద్ధీత్ప్రాయనవారిగ స్త్రీ నవషట్ పుత్రాగమాంత్సః కుజాత్॥

**దశాధ్యాయి :**

| | | |
|---|---|---|
| లగ్నమునుంచి | - | 1-2-3-4-5-8-9-11 |
| శుక్రునినుంచి | - | 1-2-3-4-5-8-9-10-11 |
| శనినుంచి | - | 3-4-5-8-9-10-11 |
| సూర్యునినుంచి | - | 8-11-12 |
| గురునినుంచి | - | 5-8-9-10-11 |
| బుధునినుంచి | - | 3-5-6-9-11 |
| చంద్రునినుంచి | - | 1-2-3-4-5-8-9-11-12 |
| కుజునినుంచి | - | 3-5-6-9-11-12 |

**శన్యష్టకవర్గు :**

**7.శ్లో॥ మందఃస్వాత్ త్రిసుతాప్తి శత్రుషుశుభః సాజ్ఞాంత్యగో భూమిజాత్ ।**
**కేంద్రాయాష్ట ధనేష్వినాదుపచయే ష్వాద్యే సుఖేచోదయాత్ ।**
**ధర్మాయాదిదశాంత్యమృత్యుషుబుధా చ్చంద్రాత్ త్రిషడ్లాభగః**
**షష్ఠాయాంత్యగతస్సితా త్సురగురోః ప్రాప్త్యంత ధీ శత్రుసు ॥**

**దశాధ్యాయి :**

| | | |
|---|---|---|
| శనినుంచి | - | 3-5-6-11 |
| కుజునినుంచి | - | 3-5-6-10-11-12 |
| సూర్యునినుంచి | - | 1-2-4-7-8-10-11 |
| లగ్నమునుంచి | - | 1-3-4-6-10-11 |
| బుధునినుంచి | - | 6-8-9-10-11-12 |
| చంద్రునినుంచి | - | 3-6-11 |
| శుక్రునినుంచి | - | 6-11-12 |
| గురునినుంచి | - | 5-6-11-12 |

**8. శ్లో॥ ఇతినిగదిత మిష్టం నేష్టమన్యద్విశేషాత్**
**అధికఫలవిపాకం జన్మినాంతత్రదద్యుః।**
**ఉపచయగృహమిత్ర స్వోచ్చగాః పుష్టమిష్టం**
**త్వపచయ గృహనీచా రాతిగై ర్నేష్టసంపత్ ॥**

**దశాధ్యాయి :**

గ్రహచారముచేతగాని, దశయందుగాని అష్టకవర్గురీత్యా అధిక బిందువులు పొందినరాశి, గ్రహము శుభఫలితముల నిచ్చును.





'విశేషాత్' అని చెప్పుటవలన - త్రికోణశోధన - ఏకాధిపత్యశోధన శాస్త్రాంతరముల వలన తెలుసుకొని విశేషఫలితములు తెలుసుకొనవలెను.

జన్మకాలమందు గ్రహములు స్థితివలన గోచారమందు గ్రహముల చారవలన, అష్టకవర్గు ఫలితములు 3-6-10-11, మిత్ర-ఉచ్చ స్థానములందు శుభఫలితములనిచ్చును.

అష్టకవర్గునందు బిందువులు అధికముగా వచ్చినను, ఫలితమిచ్చు గ్రహము దౌర్బల్యము పొందియున్నచో అష్టకవర్గు నిర్జీవమగును. అందుచేత గ్రహము యొక్క బలమును ముందు పరిశీలింపవలయును. స్థానబలము చాలా గొప్పది.

**జాతక సంగ్రహమందు :**

**శ్లో॥ దిక్‌స్థాన కాల చేష్టా బలయుక్తో నాస్తగోనరిపుయుక్తః**
**నపరాజితశ్చయుద్ధే శుభగోయస్తస్య శోభనా హి దశా ।**
**ఉక్త విపరీత సంస్థానాంన శుభాస్స్యుః చేతి కీర్తితంపూర్వైః**
**నీచాస్తగేఽరిరాశౌ రంధ్రే వ్యయభేఽథ యేబలైర్హీనః**
**తేషాందశాసు మతిమాన్ సంపత్తి ర్నిర్దిశేద్యథాయోగ్యమ్ ॥**

**ఇతి గోవింద సోమయాజి కృతౌ**
**బృహజ్జాతక వ్యాఖ్యాయాం**
**దశాధ్యాయాఖ్యాయాం**
**నవమాధ్యాయః**

★★★

# దశమాధ్యాయః

# కర్మజీవాధ్యాయః

**1. శ్లో॥ అర్థాప్తిః పితృజననీ సపత్నమిత్ర**
**భ్రాతృ స్త్రీ భృతక జనాద్ది వాకరాద్యైః ।**
**హోరేంద్వోః దశమగతై ర్వి కల్పనీయా**
**భేంద్వర్కాస్పద పతిగాంశ నాథ వృత్యా ॥**

**దశాధ్యాయి :**

సూర్యుడు దశమస్థానమందున్న తండ్రివైపు నుంచి ధనాగమము లేదా జీవనము కలుగును. చంద్రుడున్నచో తల్లివైపున-కుజునివలన సపత్ని మూలక ముగా, బుధుడున్న స్నేహితులవలన - గురుడున్న సోదరమూలముగా - శుక్రు డున్న భార్యా మూలకముగా - శనియున్న సేవక మూలముగా జీవనము కలుగును.

'అర్థం భార్యా శరీరస్య' అని శాస్త్రవచనము కావున, భార్యా పరిగ్రహవశాత్తు పురుషునకు గుణదోషములు కలుగును. భార్యా జన్మకాలముననుసరించి పురుషుని భాగ్యముండును.

**స్వల్పజాతకమందు :**

**శ్లో॥ పుంజన్మ ఫలంయద్యత్ ఘటతే నస్త్రీషు తత్పతిషు తత్తాసాం ।**
**వక్తవ్యం రాజాద్యం వృషణ-వినాశనాది వా పాపమ్ ॥**

ధనాగమము-వృత్తి-ఉద్యోగ-వ్యాపార-వ్యవహారములు గ్రహముల బలా బలముల ననుసరించియుండును. ఉచ్ఛవృత్తిగాని, నీచవృత్తిగాని. స్థల కాలములుగాని గౌరవా గౌరవాదులుగాని, దశమభావము ననుసరించి యుండును.





**శ్లో॥ దశమే వా గ్రహరహితే చంద్రాత్ భానోస్తథా తయోర్బలినః ।**
**తదధీశ్వరాంశ నాథ స్వభావవృత్త్యోప జీవనం కురుతే ॥**

దశమమందు గ్రహములు లేనిచో, చంద్రుని నుంచి దశమముగాని, సూర్యునినుంచి దశమముగాని ఎవరు బలవంతులో, వారినుంచి దశమస్థానము పరిశీలించవలెను. ఆ దశమాధిపతి - దశమాధిపతి ఉన్న నవాంశాధిపతి స్వభావ స్థితుల ననుసరించి జాతకుని జీవనముండును.

**2. శ్లో॥ అర్కాంశే తృణకనకోర్ణ భేషజాద్యైః**
**చంద్రాంశే కృషి జలజాంగనాశ్రయాచ్చ।**
**ధాత్వగ్ని ప్రహరణ సాహసైః కుజాంశే**
**సౌమ్యాంశే లిపిగణితాది కావ్యశిల్పైః॥**

**దశాధ్యాయి :**

దశమాదిపతి నవాంశ, సూర్యసంబంధమైనచో, ఫల-వృక్ష-ధాతు-విక్రయ-శిల్ప-ద్యూత-ప్రభుత్వోద్యోగ-వైద్యాద్యులు జీవన విషయములగును.

చంద్రాంశ వలన వ్యవసాయము-ద్రవపదార్థములు-స్త్రీల అలంకార భూషాదుల వలన జీవనముండును.

కుజాంశవలన లోహ-అగ్ని-యంత్ర సాహసముల వలన జీవన ముండును.

బుధాంశవలన వ్రాత-గణితము-రచనవ్యాపారం-కళలు-ద్యూతాదులు-జీవన విషయములగును.

**3. శ్లో॥ జీవాంశే ద్విజవిబుధాగమాది ధర్మైః**
**శుక్రాంశే మణిరజతాది గోమహిష్యైః ।**
**సౌరాంశే శ్రమవధభార నీచశిల్పైః ।**
**కర్మే శాధ్య షిత నవాంశ కర్మసిద్ధిః ॥**

**దశాధ్యాయి :**

గుర్వంశ అయిన బ్రాహ్మణ - మేధ - మత - విద్యా సంబంధములచే జీవనము పొందును.

శుక్రాంశవలన మణులు - స్వర్ణాది లోహములు - వాహనములు - పశువులు - ద్రవపదార్థాములు - (పాలు, పెట్రోలు రసాయనములు - మందులు) మొ॥ వాటివలన జీవనముండును.

శన్యంశవలన సేవ - ఉద్యోగము - మోసము - స్వశక్తివలన జీవనము పొందును.

"కర్మేశాధ్యుషిత సమాన కర్మసిద్ధిః" అని పాఠాంతరము కలదు. దీనిరీత్యా, దశమాధిపతి నవాంశ ననుసరించి ఆయాదేశములందు - ప్రాంతములందు, అనగా అరణ్య-గ్రామ-నదీ-సముద్ర-మరు-పర్వత-ద్వీపములందు జీవనము పొందును.

ఈ విషయము సారావళియందునూ విశేషముగా చెప్పబడినది.

జాతకుని జీవనమును, జాతి-దేశకాల-అవస్థాను రూపముగా ఊహాపోహా నైపుణ్యముచే బలవద్గ్రహానుసారముగా నిర్ణయించవలయును.

**4. శ్లో॥ మిత్రారి స్వగృహగతైస్తత స్తతోర్థాః**
**తుంగస్థే బలిని చ భాస్కరే స్వవీర్యాత్ ।**
**ఆయస్థై రుదయ ధనాశ్రితైశ్చ సౌమ్యైః**
**సంచింత్యం బల సహితైరనేకధా స్వమ్ ॥**

**దశాధ్యాయి :**

మిత్రక్షేత్రము నందున్న గ్రహము మిత్రులద్వారా, తెలిసిన వారిద్వారా ధనలబ్ధి కలిగించును.





స్వక్షేత్రమందున్న గ్రహము, స్వజన బంధు వర్గముద్వారా ధనాగమము కలిగించును.

సూర్యుడు ఉచ్చయందుండి బలవంతుడైనచో, లగ్న - ద్వితీయ - లాభము లందు సౌమ్యులున్నచో ఆత్మప్రభావము, స్వశక్తివలన వృద్ధిలోకి వచ్చును. తండ్రివలన ఉద్యోగ - విభవములను పొందును.

కర్మస్థానమువలన వృత్తి - ధన స్థానమువలన ధనము - లాభస్థానము వలన ధనము వచ్చువిధానము, లగ్నమువలన ఆత్మస్వభావము తెలియును.

అందుచేతనే ఇట్లు చెప్పబడినది.

**శ్లో॥ దశమేశస్య వృత్త్యైవ ధనేశస్యోచితం ధనం ।**
**లాభాధీశా దవాప్నోతి విలగ్నే శాత్మతోనరః ॥**

వరాహమిహిరుల హోరాశాస్త్రము 10 అధ్యాయములూ మందబుద్ధులైన శిష్యుల హితముకొరకు వ్యాఖ్యానము వ్రాయబడినది. పాండిత్య ప్రకర్ష ప్రకటించుటకు కాదు. పునరుక్తులు - అపశబ్ధములు ఉండును. కనుక బుధులు క్షమింతురుగాక॥

**శ్లో॥ స్థురతుభుజంగమ హారం మమహృది తేజోమహావిషాహారం ।**
**శ్వేతారణ్యవిహారం శ్వేతం శీతాంశు శేఖరం హారమ్ ॥**

**ఇతి గోవింద సోమయాజి కృతౌ**
**బృహజ్జాతక వ్యాఖ్యాయాం**
**దశాధ్యాయ్యాఖ్యాయాం**
**దశమాధ్యాయః**
**॥ శివార్పణమస్తు ॥**

